# సాహితీ విపణి



సమితి సభ్యులు



సాధన సమితి
సికింద్రాబాదు

# సాధన సమితి కార్యనిర్వాహకవర్గము

---

తారణ నామ సంవత్సరము



అధ్యక్షులు

శ్రీ భాగి నారాయణమూర్తి

ఉపాధ్యక్షులు

శ్రీ కందాళ సత్యనారాయణ

కార్యదర్శి

శ్రీ జమ్మలమడక పూర్ణచంద్రరావు

సహాయ కార్యదర్శి

శ్రీ ముదిగొండ రాజేశ్వరరావు

సంపాదకవర్గము

శ్రీ పిల్లలమర్రి వేంకట హనుమంతరావు
శ్రీ జమ్మలమడక సూర్యప్రకాశరావు
శ్రీ భండారు చంద్రమౌళీశ్వరరావు

ఆడిటరు

శ్రీ నెలూరి రామమూర్తి

ప్రత్యూష ప్రచురణము 12

# సాహితీ విపణి





*

సమితి సభ్యులు



సాధన సమితి

సికింద్రాబాదు

ఒక రూపాయి

సర్వస్వామ్యములు సమితివి

ప్రథమ ముద్రణము



మార్చి

1945

రామా ప్రెస్

సికింద్రాబాదు

# మా మాట

తలచిట్లు తోరణ కార్యక్రమం పూర్తి చేసుకుంది మా సమితి యీ ప్రచురణతో. పాఠకులకు ఖండకావ్య కథానిక ఏకాంకిక లందజేసుకుంది సమితి ఇదివరలో. ఈసారి వ్యాససంపుటికై తలపెట్టింది. కాని లోకుల భిన్నాభిరుచిని పురస్కరించుకొని యేకైక వస్తువుగాక బహువస్తువుల సమీకరించింది తన విపణిలో. కేవల ఉత్పత్తిగాక వ్యాప్తి, వ్యయముగూడ అవసరంగదా వాణిజ్యాభివృద్ధికి!

పూర్వపు సభ్యులుగాక మరికొందరు సాధకులు సోదరి కస్తూరీదేవి, శ్రీయుతులు శేషగిరిరావు, విష్ణుజనార్దనరావు, ప్రభాకరరావు, వెంకటావధాని, సింగరాజు సోదరులతో చెలిమి సమకూరిందీ యేడు. మా యితఃపూర్వపు ప్రచురణతో శ్రీ ప్రభాకరరావుగారు పాఠకలోకానికి పరిచయమైనారు. మిగిలినవారుగూడ పత్రికా ముఖాన ఇంతో— అంతో— పరిచయులే.

మహాసంస్థలే యుక్తవాయువు లెక్కనలేక తల లొగ్గుతున్నాయి. పసితనములో మాసమితి యథారీతిముందంజ వేస్తోందంటే సభ్యుల సమధికోత్సాహం, స్వార్థరహిత సేవ— కారణాలు. ఈ ప్రచురణకార్యసిద్ధికి శ్రీ బూర్గుల రంగనాథరావుగా రెక్కువ భాగం పంచుకున్నారు. వారికి వారిద్వారా పరిచయమైన పోషకవర్గానికి మా అభివందనాలు.

హైదరాబాదు రేడియో నిలయమునుంచి ప్రసారితములైన ప్రసంగాలను ప్రచురింప అనుమతించినందుకు నిలయమువారికి మా కృతజ్ఞత.

పార్థివ నిజచైత్ర శుద్ధ పాడ్యమి

కార్యదర్శులు.

# ఆవిష్కరణము

సాహితి సకల హితైకసార ప్రతిపాదనాసమర్థమై, మానవలోకోద్ధరణోద్దేశితమై, సహజ రసానందమూర్తియై యొప్పారునది. ఆంధ్రసాహితీ సాధకుడు నేటి కనేక ప్రక్రియ లలో శారదను దర్శించి, యుపాసించి, యావిష్కరించినాడు.

ఆంధ్ర గృహములలో 'సాహిత్యదీపములు' వెలు గొందవలెనని ప్రబోధ మెన్నడో సల్పినాడు కవి. సాహి త్యార్చనము సంపూర్ణానకాశమును పొందలేదు. మినుకు మినుకు మనుచున్న సాహితీ రోచిస్సులు ప్రజ్వలితములు గావలెను.

ఈ మహదాశయమే సాధన సమితిని పాలించుచున్నది.

ఇట్టి సత్సంకల్పముతో, సహృదయలోక సమాదర ముతో సాధన సమితి యేడెనిమిది వత్సరములు సాహితీసేవ చేసి యిప్పటికి పద్రెండు ప్రచురణముల వెలువఱచినది. 'కల్లబొల్లి కబుర్లకన్న కార్యరూప సాధనమే ఘన'మని యీ సమితిసేన యొసగు గుణపాఠము.

నిరంతర సాధనావశమున నలవఱచుకొనుచున్న శిల్ప హృదయమును, మధురభావమును, నిశితగ్రథనాకౌశలమును ప్రకటించు వివిధ ప్రక్రియా విశేషములనే యీ 'సాహితీ విపణి' లో మనము సందర్శింపబోవునది.

వీనిలో గొన్ని రేడియో ముఖమున ప్రసారితములై సభ్యుల యభ్యుదయమును జాటుచున్నవి. ఇందలి వ్యాసములలో సభ్యులు ప్రతిపాదించిన సిద్ధాంతములు నూతనములు; ప్రత్యేక వ్యక్తిత్వ ప్రకాశితములు. ప్రతిభాసమన్వితములట్టివేగదా !

అధికారానుగుణముగా సహృదయులు 'వీణ' లో విహరించి మూర్తుల దర్శించి, గ్రహించి మన్నింతురుగాత !

ఇదే యావిష్కరించుచున్నాను.

గుంటూరు
30-3-45.

పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు,
శారదాపీఠము.

# సామగ్రి.

| వస్తువు | | విహారులు |
|---|---|---|
| 1. దేహి | [ప] | శ్రీ యాంసాలి విష్ణుజనార్దనరావు |
| 2. సాహిత్యోద్దేశము | [వ్యా] | శ్రీ పిల్లలమర్రి వేంకటహనుమంతరావు |
| 3. రెండు ఛాయలు | [క] | శ్రీ నెల్లూరి కేశవస్వామి |
| 4. తిక్కన కవితా ప్రతిభ | [వ్యా] | వేదం ప్రభాకరరావు |
| 5. పిచ్చిక గూడు | [క] | శ్రీ భాగి నారాయణమూర్తి |
| 6 వరూథినీప్రవరాఖ్యులు | (వా) | శ్రీ జమ్మలమడక సూర్యప్రకాశరావు |
| 7 స్వాతంత్ర్య యోగము | [భా.గ] | శ్రీ పరిమి వెంకటావధాని |
| 8 కథానిక | (వ్యా) | శ్రీ బూర్గుల రంగనాథరావు |
| 9 ఆత్మార్పణం | (క) | భండారు చంద్రమౌళీశ్వరరావు |
| 10 ముష్టిపడుచు | (గే) | శ్రీ సింగరాజు లింగమూర్తి |
| 11 ఆషాఢ కన్య | (గే) | శ్రీ విష్ణుభొట్ల కామేశ్వరరావు |
| 12 వెంటి చెట్టు | (క) | శ్రీమతి కస్తూరీదేవి |
| 13 ప్రబోధము | (గే) | శ్రీ సింగరాజు ధారాధర రావు |
| 14 అస్తమయం | (భా.గ) | శ్రీ జమ్మలమడక పూర్ణచంద్రరావు |
| 15 రాష్ట్ర గీతి | (గే) | శ్రీ మానూరి కేమగిరిరావు |

# దేహి

'యాంసాని విష్ణుజనార్దన్'

సతతంబు న్నిను నాత్మ గొల్చుచును సంసారేచ్ఛ వీడంగ జీ
వితమిట్లర్పణ జేసినట్టి నను దుర్వీర్యాంశుగా జేసి తీ
వతి ఘోరంబగు పాపకూపమున మాయాంబోనిధిన్ ద్రోసి; ఆ
శ్రితునై మ్రొక్కెద జేర్పవే దతి హరా! శ్రీరామలింగేశ్వరా!

మనమం దెన్నడు నిన్వినా యితరదైవంబున్ తలంపంగ జా
లను, కించిత్కరుణా రసంబొలుకగన్ లాలించి దాసానుదా
సుని గావించి విపత్సముద్ర గరళస్ఫూర్తిన్ నివారింపచే
సి ననున్ గావగదయ్య ఫాలనయనా శ్రీ రామలింగేశ్వరా!

ఎంతేనిన్ విపరీతమయ్యెగద మజ్జీవేచ్ఛ సర్వంబు; నా
పంతంబంతయు రిత్తయయ్యెగద; విశ్వం బెంతగా మారినన్
సంతోషించెదవే కృపానిధి! గిరీశా! మదిన్ నమ్మినన్
చింతాక్రాంతుని జేసివేసితివిగదా శ్రీ రామలింగేశ్వరా!

గ్రైవేయంబులు భూషణంబు లగు; దుర్గాదేవి యర్ధాంగియా
నీ విశ్వంబు స్మశానవాటికయగున్; నీ మేను చర్మంబగున్;
నీ వైభోగము భస్మమాగనుకనే నీకింత క్రౌర్యంబొకో!
శ్రీ విశ్వేశ్వర ఫాలలోచన! శివా! శ్రీ రామలింగేశ్వరా!

తరమే ధాతకు ధాతతాతకును నీ తత్త్వం బెఱుంగం భవ
త్కరుణా వీక్షణ మాలికల్ పరిపి భక్తానీకము న్నేలు నా
సరణిన్ మా కొసగంగదే సుకవితాచాతుర్య సామగ్ర్యమున్
స్థిరమైనట్టి యశంబులన్ సుఖములన్ శ్రీ రామలింగేశ్వరా!

# సాహిత్యోద్దేశము

—పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు

లోక వ్యవహారములో సాహిత్యము-సారస్వతము-వాఙ్మయమను పదములు సమానార్థక పదములుగా ద్రష్టవ్య మగుచున్నవి. కాని యీ మూడు పదము లర్థములలో నంతరము కలవిగా పరీక్షింపఁ తెలిసికొనఁ గల్గుదుము. సాహిత్య మనునది దేశకాల పరిమితముగాక, సర్వకాల సర్వజనీనమ్ముగా నుండి విశ్వశ్రేయస్సునుగోరి నిర్మింపబడిన కావ్యసంచయమును చెందును. సారస్వతమనునది యక్షర రూపమైన సకల విద్యాశాస్త్ర కళాదులకు వర్తించును. వాఙ్మయ మనగా వాక్కుయొక్క వికారము అనగా లిఖితసంభాషణాది సమస్త వాగ్వ్యవహారమునకును వాఙ్మయమను పదము చెల్లును. ఇదిసర్వసాధారణమైనపదము. సాహిత్యము— సారస్వతము— వాఙ్మయము. ఇవి యుత్తరోత్తర విశాలములైనవి. ఈ మూడు నొకే కేంద్రముగల మూడు వలయముల వంటివి. సాహిత్యము పరిమిత వలయము; దీనిని సారస్వతవలయము చుట్టినది. ఈ రెంటిని చుట్టినది వాఙ్మయవలయము. సాహిత్యమును, సారస్వతమని, వాఙ్మయమని పిలువవచ్చును. కాని సారస్వత వాఙ్మయము లనునవి సాహిత్యమునకు వర్తింపవు.

ఇక ఉద్దేశమను పదము—ప్రతి వస్తువునకు కార్యకారణ భావమున్నది. ఘటమునకు మృత్తిక కారణము;

అన్నీ మానసిక సంబద్ధ విషయములకును, మానవు డేకార్యము
నిర్వహించినను వెనుక నొక యాలోచన యుండి తీరును.
ఈ యాలోచనమునే యుద్దేశమని, కారణమని యనవగును.
ఇది పునాదివంటిది. ఒక యుద్దేశమును పురస్కరించుకొని
మానవు డొక కార్యము నిర్వహించును. అత డాసించిన యా
యుద్దేశము పరిణామ ఫలముగా తిరిగి ప్రతిఫలించును. ఉద్దే
శ్యము—కార్యము—పరిణామము: ఇది క్రమము. వీనిలో
నుద్దేశము లోచించినను పరిణామ పరిశీలనముచే దానిని
గుర్తింప వచ్చును. ఒక్కొక్కప్పు డుద్దిష్ట పరిణామము కలు
గక పోవచ్చును. కాని కార్యమునుబట్టి దాని నెరుగవచ్చును.
ఇవ్విధముగా నుద్దేశకార్యపరిణామము లన్యోన్యాశ్రయములు.

కాగా, సాహిత్యోద్దేశ మిప్పుడు ప్రసక్తము. సాహి
త్యము "సత్యం, శివం, సుందరం" అను పరమాశయ
ములో నిమిడ్చుకొనినది. సాహిత్యమునకు కవి—విమర్శకులు
ప్రవక్తలు. సౌందర్య ద్రష్టయు స్రష్టయు కవి. దీననే యాతనిని
"కవి బ్రహ్మ" యనినారు. విమర్శకుడే తద్వ్యాఖ్యాత.
సాహిత్య మొక మధుర దర్శనము. తదితర దర్శనములో
నవలోకించుట కెంతటి యధికారము వలయునో సాహిత్య
దర్శన సాక్షాత్కారమునకు నంతటి యధికారము వలసి
యున్నది. సహృదయత్వము, రసజ్ఞత, వ్యుత్పన్నత సాహి
త్యారాధనమున కుపకరణములు.

సహృదయత్వ మనగా హృదయము కలిగి యుండుట
యని సామాన్యార్థము. ప్రతి వానికి హృదయమున్నదిగదా

కాని యది యున్నటుల తెలియువాడే సహృదయుడు. అనగా నాత్మవేదనోన్ముఖమైన యంతరంగము కలవాడు. నిష్పాక్షికముగా, నిష్కలంకముగా, సానుభూతితో నాయా వాతావరణముల యందు సంచరింపగలిగి యాయా పాత్రలనుగాని, విషయములనుగాని యవలోకించి తత్తదనుగుణముగా స్పందించు హృదయము కల్గియుండుట.

రసజ్ఞత యనగా రసము నెఱుగుటయని వాచకార్థము. అనగా విభావాను భావ సాత్త్విక వ్యభిచారీ భావసంయోగ ఫలితముగా పర్యవసించు రసస్వరూపమును దెలియుట. విభావాదికముల నెఱుగకయే యాయా భావములకు తత్తదనుగుణముగా సంచలనము పొందువారును రసజ్ఞులే. లక్షణాదికము నెఱిగియు రసజ్ఞులు కానివా రున్నారు.

ఇక వ్యుత్పన్నత యనగా లోకశాస్త్రానుభవముతో కూడిన పాండితి. పరిజ్ఞానము సమకూర్చుకొనుటలో దేశాటనము, బహు కావ్యపఠనము, సంప్రదాయజ్ఞులైన మహాత్ముల సాంగత్యము మున్నగునవి తోడ్పడవలెను. ఇన్నిటితో నుదయించిన సంస్కారమే వ్యుత్పన్నత యగును. ఇన్ని కల్గియు సంస్కారము పొందనివా రున్నారు.

ఈ యుపకరణములతోడనే సాహిత్యారాధనమునకు పూనుకొనవలెను. అప్పుడే సాహిత్యోద్దేశమును గ్రహింపవచ్చును. ఎంతవరకీ యుపకరణములులేక పరిశీలించుచుందుమో యంతవరకు సాహిత్యోద్దేశము ప్రశ్నారూపముననే యుండి యనేక యపోహలకు తావిచ్చును. నేడు లోకమున

వ్యవహరింపబడుచున్న సాహిత్యముగాని, సాహిత్యోద్దేశ మను నట్టిదిగాని, నిత్యమైన సాహిత్యపరములుగావు. సార్వ జనీన సార్వకాలీనతలందు వ్యాగ్యము.

సాహిత్యోద్దేశ మన్నికాలములందును, అన్నిదేశము లందు నొకటేయయి యుండును. జీవితోద్దేశమెట్లు బ్రహ్మా నందానుభవమో అట్లే సాహిత్యోద్దేశము సైతము బ్రహ్మా నంద సహోదరమగు రసానందానుభవమగును "రసోవైసః" అను శ్రుతివాక్యము జీవితమునకు సాహిత్యమునకు చెందినది. ఋషిప్రోక్తమైన వాక్యము బ్రహ్మానంద సాధకులకు ప్రమా ణము. రసానంద పిపాసులకు కవి వాక్య మట్టి ప్రమాణము. కవి ఋషితుల్యుడు. కావుననే 'నానృషిః కురుతే కావ్యం' అనినారు.

మోక్షగాములకె ట్లనేక పథము లనుగమ్యమానములై ప్రతీయమానములగు చున్నవో యట్లే సాహితీ దర్శనా లక్ష్య మును గడించుట కనేక మార్గము లాయాయుగములలో నను గమ్యమానములైనవి. ఆయా మార్గములే యాయా కాలాను గుణముగ నుద్భవించిన ఉద్యమముల పరిణామములు.

వైదిక వాఙ్మయముయొక్క గహనతయే పురాణ గ్రంథరచనోద్యమమునకు హేతువు. శైవవైష్ణవ సంఘర్ష ణమే వీరశైవవైష్ణవోద్యమములకు కారణము. అనుకరణ బాహుళ్యమే స్వతంత్ర రచనోద్యమమగు ప్రబంధ ప్రక్రి యకు దారి తీసినది. కర్మసిద్ధాంతాచరణాశక్తతయే 'భక్తి మార్గావలంబనమునకు కారణము. ప్రాచ్యసాహిత్య

సూత్రములపై ప్రత్యయము లేక పోవుటవలన నేమి, కాలా భావము వలననేమి, సామాన్యజనుల కందుబాటులో సాహిత్యము నుంచవలెనను ఉద్దేశమే, నవ్యసాహిత్యోద్యమమునకు మూలము. ఈవిధముగా నుద్యమములు బయలుదేరి సాహిత్యము ననేక గతుల నడిపినవి.

ప్రాచీన లాక్షణికుల సాహిత్యోద్దేశమును గమనింతము. సప్త సంతానములలో కావ్యము శాశ్వతమైనది. "విశ్వ శ్రేయః కావ్యమ్" అనినారు. అనగా సార్వజనీనత యుండవలెనని సూచ్యార్థము. "వ్యవహారవిదే శివేతరక్షతయే సద్యః పర నిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశయుజే" అనుటలో విశ్వశ్రేయస్సెట్లు కలుగవచ్చునో లక్షీకరించినాడు. కావ్యాత్మ మీమాంస యొనరించి లాక్షణికులు రసానందానుభవమునకు కావ్యమందలి వివిధాంశలను పృథక్కరించినారు. అవే రస, అలంకార, గుణ, రీతి, ధ్వని, వక్రోక్తి అనుమాన, ఔచితులు. లక్ష్య మొక్కటే నాటికి నేటికి. దానిని సమీపించు మార్గములు మాత్రము భిన్నములు.

జీవిత లక్ష్యమును సాధించుటకు కర్మ, జ్ఞాన, భక్తి మార్గము లుద్దేశింపబడినవి. ఆత్మానందమే పరమోత్కృష్టమైన జీవితధర్మము. తదానంద సంధానమునకే యీ మార్గములు. సాహిత్య మీ త్రిమార్గాశ్రయము. ప్రభు, సుహృత్, కాంతా సమ్మితములని లాక్షణికుడు వ్యపదేశించినాడు. వేదములు కర్మను విధించునవి. పురాణములు ధర్మపదమ్మును

నడచిన వారిని గూర్చి నివేదించి కర్తవ్య ధర్మముల నిరూపించి ఫలాపేక్షలో మనుజునికి నుత్సాహము కల్పించునవి. కావ్యము లోకమును మరపించి మురిపించునది. అది కాంత హాస్యమువలె సుస్మితముగ, సుకుమారముగ, లలితముగ, వ్యంగ్యమాత్ర విలసనముతో సంస్కరించునది.

సాహిత్యము సౌందర్యమూర్తి. సౌందర్యావిష్కరణాస్వాదనములు సహృదయ వేద్యములు. సాహిత్యోపాసనమే యీశ్వరోపాసనము. ఇదే సౌందర్యోపాసనము. రససిద్ధి లేక సౌందర్య సాక్షాత్కారమే ఫలము. ఇయ్యది యలౌకికానంద స్వరూపము. అతీంద్రియమైనది. ఇట్టి యానందమును సశరీరముగ ననుభవింప దగినది.

సాహిత్యము రాజస తామసవృత్తులను లీనమొనరించి, శుద్ధసత్త్వమును ప్రకాశింపజేసి తద్ద్వారమున సౌందర్యాలోకనమున కర్హత నిచ్చునది. సాహిత్యము నిరంతర భావనా విశేషముచే పరబ్రహ్మానంద సహోదరమగు నానందము నాస్వాదింప జేయునది. నిత్య చైతన్యము గలిగినట్టి, శుభప్రదమైనట్టి రసానుభవమును కల్గించి మనోనేత్రమునకు దివ్య సాక్షాత్కారము కల్గించునది సాహిత్యము.

ఇట్టి పరమోత్కృష్ట ఉద్దేశముగలది సాహిత్యము. అందుచేతనే అది మధురదర్శనమైనది.

(ఇది 'హైదరాబాదు రేడియోనిలయము'నుండి 6-6-44 తేదీన ప్రసారితమైనది.)

# రెండు పాయలు

—నెల్లూరి కేశవస్వామి

"ఏక్ కప్ చాయ్ లావ్ ?"

పరిచిత కంఠము వినపడగానే ఫులిక్కిపడి తిరిగి చూశాడు వాసు.

ఖాసిం! ఖాసిమేనా ?

వాసు హృదయము ఒక్కసారి ఆగి తిరిగి కొట్టుకో సాగింది తీవ్రంగా.

చేతులు వణికాయి. ఓ చేతిలో మైసూరుబోండా రెండో చేతిలో నీళ్ళు తొణికిసలాడాయి. చూస్తున్నాడు. చూస్తున్నట్టుగా నే నిలుచుండి పోయాడు నిశ్చేష్టుడై.

"ఏ అయ్యర్ ! తీసుకరావేం" ఆంధ్రమహాశయు డిలాగా అన్నాడు. ఆదెబ్బకు తేరుకున్నాడు వాసు. చప్పున బోండాప్లేటూ నీళ్ళగ్లాసూ తీసికెళ్ళి ఆ మహాశయుడిముందు పెట్టాడు. మళ్ళీ ఖాసింను చూట్టం మొదలెట్టాడు. ఖాసిమేనా! ఈ వేషమేమిటి? బ్లూ బ్లౌజర్ కోటు తెల్లసిల్కు ఆఫారము తెల్లనెక్కటు, మెడకు మఫ్లరు, నల్లఫ్రేము కళ్ళద్దాలు, కాళ్లకు తెల్లసాక్సు, షూస్; ఉంగరాలు ఉంగరాలుగల జుట్టును బాగా వెనక్కు ఎగదువ్వేడు. కుడి మోచేయి టేబిలుపైన నుంచి, ఆరచేతులో గడ్డం అణచి వీధిలోకే చూస్తున్నాడు, నిశ్చలంగా. ప్రక్క కుర్చీపై 'టెన్నిస్ రాకెట్' పెట్టివుంది.

ఖాసిమేనా? మళ్లీ సందేహం కలిగింది వాసుకు. దాంతోపాటు కాస్త నిరుత్సాహంకూడా కలిగింది. దగ్గరి కెళ్ళి చూస్తే? కనుక్కుంటే? తీరా ఖాసిమే అయి తనను గుర్తిస్తే ఈ స్థితిలో ఖాసిం ఎదుటపట్టమే? ఎంత అవమానం! ఛా వద్దు... ఖాసిం కంటపడకుండా దూరంగా వెళ్ళి ఓ పెద్ద మనిషితో తగ్గు స్వరములో "ఏంకావాలి సార్" అన్నాడు వాసు. అంతసేపూ ఓకంట ఖాసింను కనిపెడ్తూనే వున్నాడు. ఆ పెద్దమనిషి జవాబు యివ్వకముందె ఖాసిం మొహం ఇటు తిప్పి "చాయ్ లావ్" అనేసరికి వాసు ఒక్కగంతులో మళ్లీ అలమారాల వెనక్కి వొచ్చేశాడు. ఈసారి గుండె మరీ తీవ్రంగా కొట్టుకోసాగింది. మొహాన్ని చెమటల్ని చూపుడు వేలుతో తుడుచుకుంటూ "నన్ను చూడలేదుగదా!" అనుకున్నాడు. తినుబండారాలున్న రెండు అలమారాల మధ్య సందులోనించి చూడసాగాడు ఖాసిం ముందర టీ కప్పు పెట్టి వుంది. ఖాసిం ఊంకుత్తో స్పూన్ తిప్పుతున్నాడు. కాని దృష్టిమాత్రం వీధివేపే వుంది. ఎదుట పెద్ద గడియారములో **5-50** అయింది. ఆ పక్కనిది మిడిల్ స్కూల్ గోడలు కనిపిస్తున్నాయి. అవి కనిపించగానే వాసు ఆలోచనలో ఓ పది సంవత్సరాలు వెనక్కి తిరిగాయి.

ఆ స్కూల్లోనే తానూ ఈ ఖాసిమూ ఆరు సంవత్సరాలు జంటగా చదివింది. ఆ స్కూల్లోనే వాళ్ళ స్నేహలత యంకురించింది. పెరిగింది. ఆఖరికి అంతరించిందికూడాను. ఈ స్నేహమేకాదు వాసు జీవితంలోనిదో ముఖ్యఘట్టం—

మధురఘట్టంకూడా అంతమొందింది, ఆ స్కూలుతోనే. తాను ఒకే ఒక్క కొడుకు సంతానం. ఎంతో గారాబంగా పెంచిన తల్లిదండ్రులు జ్ఞాపకమొచ్చారు. ముఖ్యంగా ప్రేమ పూర్తి అమ్మజ్ఞప్తికిరాగానే గుండె బరువెక్కింది. వచ్చే కొద్ది ఆదాయమూ జూదాలలో తగలేస్తున్నా తన కేకష్టము రాకుండా ధర్మఘారం వలకు హాయిగ వెళ్ళబుచ్చింది అమ్మ, కాని ఘోరుఘారంలో చేరాక ప్లేగు. ప్లేగు—ఆరోజుల్లో ప్రతి యేటా వచ్చేది. మహాంకాళి పూజలు వారూ తిరక్కుండా అమ్మా నాన్నా ఇద్దఱినీ పొట్టబెట్టుకుంది. మామయ్య వచ్చాడు. చదువుకు స్వస్తిచెప్పించి ఇల్లు ఖాలీచేయించి తన వెంటేసుకపోయాడు వూరికి. అక్కడ తన రాక అత్తయ్య ఎంతమాత్రం యిష్టంలేదన్న సంగతి మొదటిరోజే గ్రహించుకో గలిగాడు. తనకేపదేనా ఆస్తి అనేది వుంటే అందరూ చేరదీసేవారేమో, తాను వాళ్ళింట్లో నిలవలేకండా చేయ గలిగిందంతా చేసింది అత్తయ్య. ఆఖరుకు ఓరోజు మామయ్య లేకుండా చేసి తన కొడుకుని కొట్టాడన్న నెపం మీాదగా, దాంతో వాసుకు హడలెత్తి అదేరాత్రి యెవరికితెలియకుండా వెళ్ళి రైలెక్కాడు. టిక్కట్టు లేకుండానే ప్రమాణం చేస్తూ మధ్య కనీసం పదిసార్లన్నా దాచేసినా పట్టుపడకుండా ఎల్లానో అల్లా పదిహేనురోజులు తర్వాత బొంబాయి చేరుకున్నాడు. అక్కడపడ్డపాట్లు యిన్నిఅన్నిగావు.

ఈరానీ హోటలులో టేబిలు తుడిచాడు. పత్రిక లమ్ముతూ తిరిగాడు. బూట్లకు పాలిషుచేశాడు. స్కూలుకు



బుక్సు మోసుకపోయాడు. స్టూడియో బాయ్‌గా పనిచేశాడు. జేవియర్ కాలేజిహాస్టలులో సర్వరుగా కుదిరాడు. ఇంత చేసినా పేపూట కాపూటకు సరిపోదు. పస్తుండటం తిట్లు తినటంగానే అలవడిపోయినాయి. ఆఖరికి ఆరువత్సరాలు తిరిగి తిరిగి పట్నము వచ్చినప్పుడు జేబులో ఎక్కడా ఏగాణి లేదు. బొంబాయిలో కాలుపెట్టగానే తెంపి పారవేసిన జంధ్యము మళ్లీ తగిలించుకొని ఈ అయ్యర్ హోటల్లో సర్వర్‌గా చేరగలిగాడు. ఇది మాత్రమే శాశ్వతం. రేపు మళ్ళా విధి ఎటు తన్నుకుపోతుందో, ఏమో—ఒక వేడి నిట్టూర్పు విడిచాడు వాసు.

పెద్దగడియారం నాలుగు పావులూ ఆరుగంటలూ కొట్టింది. ఖాసిం తన ఎడమచేతినున్న రిస్టువాచిలో టైమ్ సరిచూచుకున్నాడు. టీ పూర్తి అయింది జేబులోనుంచి గోల్డుఫ్లేక్ సిగరెట్ తీసి ముట్టించాడు.

వాసు యింకా రెండు అలమారాల మధ్య సందులో నుంచి చూస్తునే వున్నాడు. వాసు పనేమీ చెయ్యకుండా అల్లా నిల్చోటం చూచి తోటి సర్వరు సుబ్బులుకు వళ్ళు మండుకొస్తుంది. ఇంగె యేంచేస్తుండావురా అన్నాడుకూడ ఓ సారి. కాని వాసుమాత్రం అప్పుడు ఎవరినీ ఖాతర్ చేసే స్థితిలో లేడు. తన్ను కాదన్నట్లుగానే దులిపేసి మళ్లీ తన రివెరీస్‌లో మునిగిపోయాడు.

ఖాసింఅల్లా మిడిల్ స్కూలుకేసి చూస్తూఆలోచిస్తూనే వున్నాడు, అసలేమిటా ఆలోచన తన గత జీవితం జ్ఞాపక

మొస్తుందా వాసుకు జ్ఞాపక మొస్తున్నాడా! మెడమీద చిరిగిన షేర్వానీ, మాసికలు వేసిన లాగూ, బాగా మైలపట్టిన టోపీ, చిరిగిన బూట్లూ చిన్నప్పటి ఖాసిం తయారయ్యాడు వాసు కళ్ళకు. ఆ ఖాసింకూ ఈ ఖాసింకూ ఎంత తేడా వుంది. అసలు తను ఖాసిమేకాడేమో. కాని ఆకంఠం నూరుమందిలో నున్న ఖాసిం కంఠమైనది గుర్తించగలనన్న ధైర్యము వాసుకుంది. ఎంత మధుర కంఠం అది! తానే ఓ సారి ఖాసింతో యిల్లా అన్నాడు. "ఓరే ఖాసిం! నీ కంఠంలోనోవ్వపలుకుతుందిరా! నువ్వే గనుక పాట నేర్చావా, గొప్పవాడివయిపోతావు. నిజంగా ఖాసిం యిప్పుడు కంఠమాధుర్యానికి మెచ్చి తన కూతుర్నిచ్చి పెళ్ళిచేశాడేమో. లేదా! ఏ లక్కీపందెమైన కొట్టేశాడేమో? అవును. ఎందుకు అక్కర లేదల్లా ఎవరి నొసట ఎలా రాసుందో యెవరికి తెలుసు. ఆ మిడిల్ స్కూలు వదిలేముందు ఓరోజు హెడ్‌మాష్టరు అనలేదూ "మీలోనించే కొంతమంది జడ్జీలు కావచ్చు, తహశీల్దార్లు కావచ్చు, దేశనాయకులు కావచ్చు, దేశసేవకులు కావచ్చు, అని అప్పుడుఅంతాఒకరిమొహాలొకరుచూసుకొనిముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. హెడ్‌మాష్టరు వెళ్ళిపోయాక నేను తాసీల్దార్ అంటె పేచీలుకూడా పడ్డారు. ఖాసిం తన దగ్గరికొచ్చి "ఓరే వాసు! నీ కేం కావాలిరా తహశీల్దారియా, తాలుక్దారియా! అని అడిగాడు. వాసు సగర్వముగ ఖాసిం కళ్ళల్లోకిచూస్తూ అన్నాడు. "మానవ సేవ" దేశనాయకులు చేసేపని అదేనని విన్నసంగతి జ్ఞాపకం చేసుకుంటూ "ఛా! నేనైతే హైకోర్టుజడ్జీ నౌతా నచ్చా" అన్నాడు. ఖాసిం

మొహం పైకిజారిన కాప్ సవరించుకొంటు వాసు అన్నాడు మళ్లీ. "ఖాసిం ఒకవేళ నన్ను పోలీసులు అరెస్టుచేసి నీ దగ్గరికి తీసుకొస్తారనుకో అప్పుడేం చేస్తావురా ఖాసిం? సీరియస్ మొహంపెట్టి "నిన్నా! నిన్ను కాలాపానికి పంపుతాను" అంటూ కిలకిల నవ్వినాడు కాని ఏం చేస్తాడు.

ఇప్పటి ఆ చిన్నిహృదయాన్నుంచి వెళ్ళిన కోర్కెలు ఫలించాయి. వాసు ఇప్పుడు యీ అయ్యరుహోటల్ చేసేది మానవ సేవేమో, ఖాసిం హైకోర్టుజడ్జి అయినాడేమో! ఖాసిం తమ క్లాసులోకల్లా డల్‌గావుండే ఖాసిం హైకోర్టు జడ్జీ అనగానే వాసుకు అప్రయత్నంగా నవ్వొచ్చింది. థర్డుఫారం ఎగ్జామినేషన్ ఫలితాలు రోజూ తానూ ఖాసిం కలసి రిజల్టు చూడటానికి వెళ్ళటం జ్ఞాపక మొచ్చింది. తోట్టిలో మొద్దు పక్క చింతచెట్టుకింద హిందూస్థానీభయ్యా పగిడీ చుట్టుకొని మొహాన గంధము అక్షింతలు పెట్టుకుని చూచుచున్నాడు. జ్యోతిషం చెబుతూవుంటాడు అంతకుముందు ఎన్నిసార్లు స్కూలు ఎగ్గొట్టి ఆ చెట్టుక్రిందే ఎన్నో మాజిక్కులు చూపిన ఎన్నడు ఆ భయ్యాను లెక్కచెయ్యని మిత్రద్వయం ఆపూట చెరో పైసాతీసికెళ్ళి వాడిముందు కూర్చున్నారు. తన పుస్తకములో పైసాలు వేయించుకొని పేజీలు తెఱచి వాసుకు గానీ ఖాసింకుగాని రాని హిందీభాష చదువుతూ పెళ్ళాలంటో పిల్లలంటూ అదృష్టమంటూ మొదలెట్టారు. దాంతో ఖాసింకు చలాకెత్తి" అరే భయ్యా అదంతా అలావుణ్ణీ. ముందు మా పరీక్షల సంగతిఏమిా" అన్నాడు. దానికి కాదు ఖాసిం తప్పక

ప్యాసవుతాడని వాసుమాత్రం కొంతశాంతి చెయ్యాలిసివస్తుం దేమోనని యొకరు చెప్పారు. వెంటనే ఖాసిం "ఏడీశావు లేరా అంటూ వాసు చెయ్యిపట్టుకులాక్కెళ్లాడు. తీరా వెళ్ళిచూస్తే వాసు ప్యాసు, ఖాసిం ఫెయిలు. వాసు మనసుకు చాల కష్టం కలిగింది. తను ఫెయిల్ అయినా అంతచింత చేవాడుకాడేమో.

" ఏక్ కప్ చాయ్ లావ్ "

అదరిపడి చూశాడు వాసు. ఇందాక ఖాసిం కూర్చున్నకుర్చీపైన ఇప్పుడు నల్లటి సేటు కూర్చునివున్నాడు. ఏడీ ఖాసిము. వెళ్లిపోయాడు ఒక్కసారి ఆదుర్దా కలిగింది వాసుకు గబగభా గుమ్మంవరకు వెళ్ళి వీధియంత కలియచూశాడు. కాని ఖాసింజాడ యెక్కడా లేదు !

ఇందాక ఖాసిముఇక్కడేవున్నాడే, ఇంతలో మాయమై పోయినాడు, ఖాసిమేనా అసలు ఖాసి మచటికిరానే లేదేమో. వట్టి భ్రాంతియేమొ?

వాసు వెనకాల నల్లటిసేటు గర్జించాడు.

" ఏక్ కప్ చాయ్ లావ్. "

(హైదరాబాదు రేడియోవారి అనుమతిని.)

# వరూధినీ ప్రవరాఖ్యులు

— జమ్మలమడక సూర్యప్రకాశరావు

౧

ఒకరు భాషావిషయమున తగవులాడుదురు. మరొకరు వ్యాకరణాలంకారములకు బలిపీఠములు నిలుపుదురు. వేరొకరు క్రొత్తపాతల పేర్లకై గేలివడుదురు. అయ్యో! తెలుగు సాహిత్యజీవన మింత రసదరిద్రాణమైన దేమి!

కావ్యజగత్తు లౌకికాలౌకికము. కాదసలు జగత్తే లౌకికాలౌకికపు సమ్మేళనాప్తి. ఈ యర్థవాదమును పురస్కరించుకొని పెద్దనగారొనరించిన సృష్టి సంకలన వ్యాఖ్యామే స్వారోచిష మనుచరిత్రము. సర్వసృష్టి నిట్లు విశిష్టాద్వైతమున సూత్రించినాఁడు గనుకనే అష్టదిగ్గజముల దొట్టి 'యాంధ్ర కవితా పితామహు'డైనాఁడు. కృష్ణరాయ సామ్రాట్టుచేతుల లేని మాన్యత లందినాఁడు. ఉదాహరణమా?

> "మనుచరిత్రం బందుకొనువేళ పురమేగ
> పల్లకి తనచేతఁ బట్టియెత్తె"

ఓహో! ఇట్టి కవిసార్వభౌముల నేనాటనైన వినగలమా? వారిని తమవారినిగా చెప్పుకోగల్గిన తెలుగు లెంత పునీతులు!

౨

తెరదీయుచునే పెద్దనగారు భూమ్యాకాశములకు పెండ్లి పందిరి గప్పినారు. "వప్రస్థలీచుంబితాంబరములు", "ధవళ

సుధా ప్రభాధవళిత ప్రాలేయ రుక్మండలీ హారిణ'' మట. దివమునకే వంకలు దిద్దు నాపురము నిజముగా ''మహీకాంత హారతరళస్ఫూర్తి'' గలదే.

ఆ కర్మభూమి నిషాయంతయు నొక సీసమాలికలో వర్ణితమైనది. ''మొనటి వేల్పు'', ''భార్గవుడు'', ''ఆది భిక్షువు,'' ''కాసెకొంగు'' వీనికి మించి సందర్భశుద్ధి గల శబ్దము లింక లేవేమొ. వానిలో క్రమముగా జ్ఞానప్రాధమి కతలోని పేరు పెద్దఱికము, తండ్రినిబట్టి యాగర్భక్షత్రియ కుల మాత్సర్యమును మూటగట్టుకొన్న భీషణపరశుధారి, ఈశ్వరుని నిత్యభిక్షుత, పరాక్షేపవిలాస సహజతలు సుస్ఫోరకములు. ఇంతకు ''అచట బుట్టిన చిగురుఁ గొమ్మైన చేవ'' యట. ఎంత చక్కని కుంచెగీత.

పురవర్ణన మిట్లు ముక్తసరిగా మూడు పద్యాలలో ముగిసినది. సూరనగారివలె నాలుగు వర్ణములను నాలుగు పద్యాలతోనని మఱియొక పద్యముతో ఆడిన యబద్ధమునకు గిలాబుచేయుటకు తాతగారు బహుప్రౌఢులు. కృష్ణరాయని-కాదు—లౌకికుని బహువ్యాపృతి విస్మరింపలేను. అతని యర్థ చమత్కృతియు నాస్తికుని నమ్మించన ట్లుండియు నమ్మించితీరు ఆస్తిక తర్కమువోలె నుండును.

ఇక కథానాయకుఁడో ''ఆ పురి బాయకుండు''వాఁడు. ఇది యెంత సార్థకమో! కావ్యమంతయు దీని చిలువలు పల వలే. ఆద్యంతములలో నాతని సౌందర్యవర్ణనలుంచి మధ్య నాతని శేముషీ నైష్ఠికతలు బొదివినాఁడు. మను పద్యములో

వాని చక్కఁదనము "పూచిన సంపెంగ పొలుపు మధుకరాంగ
నలకు బోలె" కామినులకు భోగబాహ్యమను కథాబీజమును
స్థూలీకరించి చూపినాఁడు. అట్లని యాతఁడు విరాగి కాదు.
పాలకడలివోని నిండుకాపురము. ఈడుజోడు కలిగి ప్రియు
రాలు ననుకూలవతియగు భార్య. పోనీ సంసారపు చిక్కు
లలో నలిగి విషయపరాఙ్ముఖుఁడైనాఁడన "దేవియుం
దేవరవోలెనుండె" తలిదండ్రులు ఋలుదీర్చుచున్నారు. పెద్దనగా
రింకను దూరమాలోచించినారు. సోమిదమ్మ యలోక
సౌందర్యమాతని యనన్యాపేక్షకు కారణము కాఁగూడదా'
యని యిట్లని తత్సౌందర్యమునే పేర్కొనలేదు. ఇంతకు
శ్రోత్రియ కుటుంబపు టానుపనుచులయు సోమిదమ్మలయు
సౌందర్యవర్ణన మాయనకు మాత్రము శోభదాయకమని
పించునా? ధర్మసభాయోగ్యమగునా?

కథావిస్తృతికై యభివర్ణితమైన నాయకుని యతిథి
సేవాతత్పరతలో తితీక్షాస్ఫోరకముగ ముక్త పదగ్రస్త
ముంచు టుచితమే. నాయకుని యీ గుణబీజము సిద్ధసపర్యా,
పాదలేపసిద్ధితో స్ఫుటితమగును. మాటకారిగాని వానిచే
"ఓ చతురాస్యవంశకలశోదధి పూర్ణశశాంక," యనిపించు
కొన్నవాఁడెంత చతురవాఙ్మి, వినయధురీణుఁడు కావల
యును. పాదలేప మలముకొన్న భూమిసురుఁడు "తుహిన
భూధరశృంగశ్యామల కోమల కాననహేమాఢ్య దరీఝరీ
నిరీక్షాపేక్ష నరిగె"నట. ఇదేమి? ఇతఁడు వేదజడుఁడు కాఁడా?
వీలైనంత పుణ్యమును మూటగట్టుకొననే కాశీరామేశ్వరము

లకో బోక హిమవన్నగ సౌందర్యమనుభవింప రెక్కలుగట్టు కొన్న యీతఁడెంత రసస్నిగ్ధుఁడో, ఎంత సాహసో దారుఁడో! తెలుగు యువకు లపహాస్యముల కనుగొను ప్రవరాఖ్యుఁ డీతఁడు కాడు. అతడు వారి యంతరాత్మలలో నాడు నీరస ప్రవరుఁడు.

ప్రవరుని "పవమాన మానస తిరస్కారిత్వరా హంకృతి' తోడి హిమవన్నగ యాత్రయంతయు "అటసని" యనుటతో దీరినది. అటుపై నాతఁ డరసిన

"..................అంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుటనటనానురూప పరిఫుల్ల కలాపకలాపి జాలముం
కటకచరత్కరేణు కరకంపిత సాలము శీతశైలముం"

" ఉల్లల దలకా జలకణ
పల్లవిత కదంబ ముకుళ పరిమళ లహరీ
హాల్లోహాల మదబంభర
మల్లధ్వను లెసగ వినరె మరు దంకురముల్".

అనుటలో భాషానభిజ్ఞుఁడు సైత మనుభవింపదగు మనోహర శబ్దధ్వని యున్నది.

" నిడుద పెన్నిఱిగుంపు జడగట్ట
పగరు మున్మనుమ్ముందు తపము గైకొనినచోటు..."

అన్న పద్యములో సిద్ధునిరాక, ప్రవరునియాత్ర, వరూథినీ వరణము, బ్రాహ్మణుని తిరస్కృతి, గంధర్వ విర

హము, స్వారోచి జననము వఱకు నగు మనుచరిత్ర కథ యంతయు క్రమముగా సూచితమేమో?

ఆయా హిమవన్నగ విశేషముల నూహించుచు

"పసుపు నిగ్గులు దేఱు పాంప జన్నిద మొప్పఁ
ప్రమథాధిపతి యింటి పట్టెఱింగె
శచి కీల గఱపుచుఁ జదలేట సురరాజు
జలకేళి సవరించు చెలువెఱింగె" ననుకొను ప్రవరునిలో

నిజముగ రసిక ప్రవరుని గాంతుము. ఇట్లరయుచుండగనే ప్రొద్దెక్కినది. ఆకలి బాధతో ఇంటిపై మనసుపోయినది. గృహగమనాభిలాషియై మధ్యాహ్నము నిట్లు నిరూపించును.

'నలినీబాంధవ భానుతప్త రవికాంతస్యందినీహారకం
దళ చూత్కార పరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నముం
దెల్పెడిన్'

ఇచట భానుని నలినీ బాంధవత్వము రవికాంతకు తాపకారణ మగుసుభావములో తన రాకకై యుత్కంఠతతో నుండు "కూరిమి సోమిదమ్మ"ను జ్ఞప్తి కెలయించు చున్నాడు. నోట వ్రేలిడిన కరువలేని గోల యనుకొన్నాము. అబ్బో! ఎంత లౌకికుడు. ఇట్లనుకొని గ్రమ్మఱు వేళ పాదలేపము నీహార వారి "బెరసి"నదనుటలో కరకు మంచు నీటికొళ్లన విధియు, "కరఁగిపోవుట యెఱుఁగఁడద్ధరణిసురుఁ" డనుటలో ఉత్సాహాధఃకరణము చక్కగా సూచితములు.)

ఇట్లు పథహీనుండై భయసంభ్రమితుండైన ప్రవరుని నోట నొకయర్థాంతరన్యాసమును చిలికి పెద్దనగా రా పాత్ర

తత్వమునకు చికిలి చేసినారు. శ్రోత్రియులు "బుద్ధి జాడ్య జనితోన్మాదు" లట. అట్టివాడు తనకు తా నట్లనుకొనునా? "శ్రోత్రియు"లని సాధారణీకరించుటచే నది మనోవిహ్వాల లక్షణ (స్త్రీలక్షణము?) మగు స్వోపాలంభనమునుగాదు. అట్లు బుద్ధిజాడ్యజనితోన్మాదియే యైన "మాయా ద్వారకావంతి కాశికురుక్షేత్ర గయా ప్రయాగముల కే కాలుద్రు వ్వెడివాఁడు. అట్లుగాక ప్రకృతి సౌందర్యపిపాసి కావుననే "తుహినభూధర శృంగశ్యామల కోమలకానన హేమాద్యఃరీఝరీ నిరీక్షా పేక్ష" నిట్లరుదెంచెను. కాని ఇప్పట్టున నా తుహినభూ ధరమే "ఉద్దండగండక వేదండ వరాహ రిపుఖడ్గవ్యాఘ్ర" మగు మంచుకొండయై యుర్వొన్నది. కాగా, నా యర్ధాం తరన్యాసము కృష్ణరాయాది యనైదికుల పరిహాసస్మిత పరి భూతి కొక సాధన మాత్రమే యగును.

ఒకముని కరుణా విశేషముచే నింతవరకు వచ్చినాఁడు. మఱల ప్రభావాన్వితులగు మునుల కరుణచేతనే నిత్యకృత్య ములకు జెడకుండ యింటికి జేరగల్గును. ఈ భావములో ప్రవృత్తుఁడైన ప్రవరుఁడు గంధర్వయక్షగాన ఘూర్ణితమగు కోనను మునియాశ్రమ మని భ్రమించినాఁడు. ఇట "తహ తహ" యనుటచే బుద్ధి వివేచనములేని ఆతురతయే సూచి తము. అందును ఆ దేవగానము సామగాన సోదరమేమొ. అందుచే నాతని యూహ బలవత్కారణమగును. ఎట్లయినను నీటగొట్టుకొని పోవువాఁడు కాలసర్పమునైనను తరణోపాయ ముగ గ్రహించునుగాదా.

అతఁడా కోనచేరి అందొక గారుణోత్కృష్ణమగు భవనము నరసి డాయబోవుచో :

" మృగమద సౌరభ విభవ
ద్విగుణిత ఘన సారసాంద్ర వీటీగంధ
స్థగితేతర పరిమళమై
మగువ పొలుపు దెలుపు నొక్క మారుతమొలసెన్"

ద్రుతముతో నంతమగు నా పద్యపు నడకయు రసికుని కవ్వింపనలసి మలసి సాగి యాగి మైదూలు పిల్లగాలి తునకల వలె లేదా!

అచటి " యావాత పరంపరా పరిమళ వ్యాపార లీల" అతని మున్యాశ్రమ భ్రాంతిని సడలించి ఇచ్చోటు జనాన్విత మనువరకు దెచ్చినది. పై నాతఁ డరసి దృశ్యములో చక్కని క్రమమున్నది. ముందాతని కన్నులు మిఱుమిట్లుగొన్న నొక విద్యుల్లతా విగ్రహముచే కనులు నులుము కొని మరల చూచినది క్రమముగ శత పత్రేక్షణములు, చంచరీక చికురములు, చక్రస్థనములు, నతనాభియు గల " ఒకానొక మరున్నారీశిరోరత్నమును. ముక్కు మూసికొని మూలగూర్చొను ఆహితాగ్నికిన్ని స్త్రీవిశేషణముల నరయ వలసిన యావశ్యకమేమి? ఇతఁడు వేదజడుఁడా? కృతక నైష్ఠికుఁడా? ఇంత యరసిన యతనిలో నిలిచిన భావమేమి? "ఎవరో యొకానొక మరున్నారీశిరోరత్న" మని. ఇట్టి సవికార నిర్వికార శబల సుందరతయేగదా రసికత. ఇట్టి పరా సౌందర్య మగ్న మానసులకే యధీతము.

పై దంతయు వరూధిని యాంగిక సౌందర్యము. దాని నిరుపమించుచు నాపె ధారణాసనవిధి, వీణా వాదన రతిపార వశ్య విభ్రమములు. ఇప్పటి వరూధినీ ప్రవరుల స్థితిలో సరిగ స్వాప్నమర్త్య ప్రాతినిధ్యములున్నవి. ఇక నాపెయో ''మది లోన కోరికల్ గుబ్బటిలంగఁజూచె నలకూబరసన్నిభు నద్ధరా మరున్' సర్వసంతృప్తిగా కుడిచి కూర్చున్న వరూధిని కాతని జూచుతోడనే అప్సరోంగనానుభవ్యమగు నలకూబరత్వ మాదకు వచ్చినది. చలించినది. సిగ్గున చాటుచేరి ''అవి వ్యాకృత మీనాంకానల సూచక ధూమాంకురములువోలె పులక లంకురింప మోమంతయు కన్నులు జేసికొని మరి మరి జూచినది. ఇట్టి వికారముతో నిప్పుడాతని సౌందర్య మాత్మ గతముగ వర్ణించుకొన్నది. ఈ రామాయణమున కంతయు పది పద్యములు పట్టినవి. ఈ హంగామా యంతయుజూచి విభ్రాంతుఁడై ప్రవరుఁడు తన్నెఱిఁగించుకొనుటయే కర్తవ్యమను కొని పలుకరించినాఁడు ''ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ!'' దీనిలో నెవరో విప్రునిజూడ నేటికింత సంభ్రమమన్న యనునయము. అంతటి చంచలేక్షణములు సులక్షణము గాదన్న వితర్కము. ఉపమానోపమేయగతమగు సౌందర్య సంస్ఫురణ లున్నవి. తన కథయంతయు మూడు ముక్కలలో ముగించి ''పురంబు జేర నిం కెవ్విధిగాంతు తెల్పగదవే తెరు వెద్ది శుభంబు నీకగు''నని ఆశీశ్శుద్ధిగా వైదికత్వమును ప్రదర్శించుకొనినాఁడు. దీనికి బదులు సెలవివాఁటు నవ్వు. శర్మ గర్భోక్తులు, స్వోత్కర్షము. సాభిప్రాయాతిథ్య ప్రలోభనము. అవసరము లేని యంగలార్పులు దీనికంతకు పరిహారమొక్కటే

పలుకు "అండజయాన నీవొసగునట్టి సపర్యలు మాకునచ్చె" నని అండజయాన యనుటలో లేనిపోని సపర్యల కటుసీటు నేల తడబడుచువన్న రసికభావముతో రాబోవు నసర్థము న కాన బెట్టినాఁడు "ఇప్పు డేను రాకుండ యొకండువచ్చి మఱి యొందునె భక్తియ చాలు" నన్న బ్రాహ్మణవాక్యాలో మాయాప్రవరుని సూచించు భావి కథావ్యంగ్య మెంతెయో యున్నది. ఇట్లని యామెను మానినిగా నెఱిగించి దేవయో నిజ మహిమాన్వితగావున తెల్లిగా సంబోధించి "ప్రజలఁ నను గూర్పు"మని ప్రార్థించి నేతి ముద్దవలె చల్లగ దిగజారి నాఁడు. వైదికుని యీ స్వస్వభావ ప్రౌఢ సిరతిలో తమ కముతో గూడిన వరూథిని సెలవివాఱునవ్వు పేదవడి లేత నవ్వైనది. నిక్కము దాపలేక హృదయము నగ్న మొనరించి నది. ప్రవరుఁడు "యిట్లు పలుక వరుస" కాదనును. అనగా నక్రమమనియూ లేక వైదికుఁడను గాన మేలమాడుచున్నా" వన్న పరిహారవాక్యమా? "యజ్ఞాదులకు ఫలము స్వర్గసౌఖ్యమే గాదా? నీకిపుడు సశరీరస్వర్గసుఖమే సమకొని యుండగా "నశనాయాసాధులచే నాత్మనలచుట కుశలత కా"దని యీ స్వర్గసౌఖ్యమును వాక్కులలో చిలికి నోరూరింపజూచినది వరూథిని. ఎంత సహేతుకానునయము! దీనికి ప్రవరుఁ డేమనునో చూతము. "నీ వన్నయర్థమెల్ల నిజము కాముకుఁ డైనవానికి, నకాముకుఁ డిది గణించునె జలజాక్షి" యన్ని నే నకాముఁడ నని సూటిగా జెప్పుటగూడ నిర్లిప్తతకు భంగమే కాబోలును. పైగా జలజాక్షీ యుట. ఎంతటి యూత్మనిష్ఠ! ఎంత సౌందర్య దర్శనోపజ్ఞ?

వరూధిని యింకను అనునయాశ వీడలేదు. "కుంభగత ప్రదీప కళికా శ్రీ దోప నెందెందు బోకెందే నింద్రియముల్ సుఖంబుగను నాయింపే పరబ్రహ్మము". దీనికి తార్కాణము "ఆనందో బ్రహ్మ" యటన్న శ్రుతివాక్యము — ఈ విధముగ యోగ స్థితిని ధ్వనించు మాటలలో భౌతికసంసక్తిని నిలబెట్టుచున్నది. సచ్చిదాత్మ సంసక్తియే అజ్ఞానావస్థలోని భౌతిక సంసక్తికి హేతువన్న సత్యమును పురస్కరించుకొన్న వాద మిది. ఆత్మ నిష్ఠలేని పాండిత్య మెంత వంచకము! అందుకే ప్రవరుఁడు "సిగ్గును వెగటును బోడమ నిస్పృహాత దెలుపు నొక్క చిఱు నవ్వు" నవ్వినాఁడు. "ఈ పాండిత్యము నీకుదక్క మఱియెందే గంటిమే" యని, వ్యాజస్తుతి గావించినాఁడు. అతఁ డలౌకి కుఁడేయగుచో పై వాదమును పూర్వపక్షమొనరించి వాదింప గావంచా బిగించువాడేమో. కాని తుది తన్నొడబఱచు తత్తఱములో నయ్యామర కాంత జేయు "మెఱిగిన త" ప్పని యెఱుఁగును. అట్టిచో మాటలు పెంచుట నాగకన్యకు నాగ స్వరము బట్టుటగును. అట్లని తెగఁజెప్పినాఁడు "నాకరణుల్ దర్శులు నగ్నులుగా బ్రియములైనట్లన్యముల్ గావోడల్ తిరమే చెప్పెద మిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై దేనియల్." బాగుగ వర్ధమగుటకై చక్కని జాతీయముకూడ వాడినాఁడు.

వరూధినికి వాగ్బంధనమైనది. మోహాంధతలో బేలయై పైపాటున :

ప్రాంచద్భూషణ బాహుమూలరుచితో పాలిండ్లుపొంగారబై
యంచుల్ మోవగ గౌగిలించి యధరం బాసింపహా శ్రీహరీ

యంచున్బ్రాహ్మణుఁడోరమోమిడితదీయాంసద్వయంబంటిపా
ప్మంచుం ద్రోచెఁగలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్.

ప్రవరుని కీవరకున్న భూసురత్వ విప్రత్వముల దొట్టి పెద్దనగారు తద్బ్రాహ్మణత్వము నీ పద్యములో స్థాపించినారు. ఓరమోమిడి జాగరూకతతో నంసద్వయంబంటి పొమ్మంచుం ద్రోయుటలోని వైదిక నైశిష్ట్య మా పెద్దన ప్రవరాఖ్యులకే దెలిసినది. కాని "కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్" అని ప్రవరపక్షపాతియై దిద్దిన అర్థాంతరన్యాస సందర్భమున పెద్దనగారొక క్లిష్టతలో బడినారు. సతులన పతివ్రతలగుటచే "సతుల మాయ" లనుటలో నర్థగతమగు లగింపు కనపడ లేదు. అటు జగస్త్ర్యుత్యుడైన స్వారోచిషమనువు పితామహి 'యసతి' యనుటకును నోరురా లేదు. అనన్య భోగలోకమగు నిర్జర లోకపు వధూరత్నమునకు కామన వ్యాపార మనుచితమును గాదు. కామించినదియు దేవప్రీతికై నిత్యబుభుక్షువగు తరుణాగ్నిహోత్రిని. పొందినదియు తద్రూపభాసతనే. కాన ఎటు జూచినను వరూథిని యసతీత్వమునకు కారణమును గనపడ లేదు. అట్లని కావ్యార్థమును జెఱచు 'అసతి' శబ్దముకంటె స్త్రీ సామాన్యార్థకమగు సతి శబ్దమునే ప్రయోగించినారు ఈ ప్రయోగము మరికొన్నిచోట్లగూడ నున్నది. దీనికి పరిపుష్టిగ 'ధీర' శబ్దమునుగూడ సామాన్యార్థకముగనే వాడినారు. కాదన్న అష్టదిగ్గజములకు మరో దారిచూపినారు. కార్యేషు దాసీత్యాది షట్కర్మయుక్త గదా సతి. మాయ వేశ్యాధర్మ మనుకొన్నచో స్వపతి విషయమున సతికి సమ్మోహన (మాయ) మనుష్ఠేయమే గాదా. కాన తాత్వికదృష్ట్యా మాయా

స్వరూపిణులుగా చెప్పబడిన స్త్రీల పక్షమున తత్త్వార్థబోధక మగు నర్థాంతరన్యాసము లో "సతుల మాయ" లనుటలో అనౌచిత్యము లేదని.

త్రోపువడియు నేమియు నన లేక పోయినది. నిర్దరవధూటి. కోపావిష్కృతినంతను సేకరించుకొని "కృపారహితాత్మక" యనగల్గినది. తన్ముఖాంకురము సోకినందుకుగాను వేదన నెప మున కలస్వనముతో నేడ్చినది. ఎంత లలిత ప్రకృతియో!

"బాడబులు", "మేనకచుట్టరికము", "ననుపు కాడు" "అహల్యా జారుడు," "ఇనుప కచ్చడాల్ గట్టుకొన్న మునిముచ్చులు" మొదలగు కోపకషాయిత పద ములతో నింక నేవో ప్రాతగాథలు త్రవ్వుచున్న వరూధిని కేమియు ననక ప్రవరుఁడు ముందు 'అవ్వనజగంధిమేని జవ్వాది పస కదంబించు నొడలు గడిగికొనెనట. అటుపై వార్చి, అగ్ని దేవుని "స్వాహావధూవక్షభ" నిగాను "హవ్యవాహను" నిగాను ప్రార్థించి తత్ప్రసాదమున ఆత్మసతీ వాల్లభ్యమును నిరంతర విశ్వయజ్ఞమున నిత్యసవిత్రిహావ్యత్వ మొందును.

3

ఈ క్రింద నన్యాపదేశముగ నభివర్ణితమైన తదేక చిత్త యగు వరూధిని కరుణా విలవృత్త మెంత హృదయంగమము.

ఏ విహంగముగన్న నెలుగించుచును సారె
కునుసైకతంబులగూడ దారు
దారికన్గొని యది తనజోడుగాకన్న
మెడయెత్తి కలయంగ మింట నరయు

నరసి కన్నీటితో మరలి తామరయెక్కి
వదన మెండగ సరోవారి నద్దు
నద్ది త్రావగ నైపకట్టిట్టు గన్గొని
ప్రతిబింబ మీక్షించి భ్రమసియుఱుకు
నుఱికి యెఱకలుదడియ వేఱొక్కతమ్మి
కరుగు నరిగి రవంబుతో దిరుగు తేంట్ల
బొడుచు ముక్కున మఱియును బోవు వెదక
సంజ బ్రియు బాసి వగనొక్క చక్రవాకి.
మఱి క్రింది పరిదేవనమో ? ·

"ఎంతతపంబు జేసి జనియించినవారొకొ మర్త్య భామినుల్
కాంతు డవజ్ఞ చేసినను కాయమువాయుదు రే నమర్త్యనై
చింతలవంతలం జిఖికి సిగ్గఱితిఙ్గ స్మృతిలేనినాదు చె
ల్వింతయు శూన్యగేహమున కెత్తిన దీపికయయ్యె నక్కటా."

తనయమర్త్యనే రోయు త్యాగము, మృతికై దుర
పిల్లు మానము— ఇవన్నియు" పూతపసిండివంటి వలపుం
బచరించు "నా జాతికే లేత. వీనియాత్మశుద్ధికి సూచనగ
"చనుగప్పు తొలగ వాసనగాలి కెరు రేగు... ... ...
తనువు: దొఱఁగంగఁదలఁచి యన్వానరుహాక్షి."

తొలుత స్వోత్తరముతో ప్రారంభమైన నిర్జరవధూటి
కనువేదుఱు తిరస్కృతిమై, విరహావమానాగ్నులచే సాకల్య
ముగ తపితముకాగా నచ్ఛమై నిలచిన యిప్పటివలపే జగత్త్ర
ల్యాళ సంధాయకమగు మను సంభవమునకు యోగ్యము.
కాని, దానికై బ్రహ్మానందాధిరాజ్యపదస్థుఁ డగు ప్రవరునికి

సంకెళ్ళిడి దిగలాగుట స్వరసతకాదు. ఇచ్చటి ప్రవరునిలో నూహ్యము, సర్వాదర్శకము, సాక్షిభూతమునగు జగత్ప్రవరత్వమే యుద్దేశింపబడినది. దీనికి వినియోగము ప్రకృతి పురుషుని బ్రహ్మభాసతలో సక్త మగుచున్నదను సృష్టి సూత్ర ప్రతిపాదనము. అట్టి ప్రవరత్వమునకై యొక వియచ్చర ప్రవరునిచే నీర్ష్యావులు గట్టించెను. వరూధినిలో నిలచినది సర్వథా బ్రాహ్మతేజ సముజ్జ్వలమగు ప్రవరత్వమేకాగా తరువాతి ప్రవరుడు వ్యంజన మాత్రుడగుచున్నాడు ఇప్పట్ల గంధర్వుని రాసిక్యత శంక్యమేకాదు కావ్యరసమునకు భంగకరముగూడ నని పండితుల యాపత్తి. కావచ్చును. కాని యది తప్పరానిది. గంధర్వుడు వరూధినిని వరించె ననుటలో నట్టి యాపత్తికి తావులేదు. కానియది స్వయం తేజుడగు స్వారోచిషమను సంభవమునకు దారితీయదు. ఇటు ప్రవరుని ప్రవృత్తు నొనర్చుటచే మనువు మహాసత్త్వత చేకూరకపోగా పాత్రౌచితియు కావ్యార్థమును వికలములగును. కాదని ప్రవరరూప భాసితచే గంధర్వుడు వరూధినిని వరించెననుటలో అర్థవాద ప్రయోజకమగు రసాభాసమున్నది. కారణ శరీరులగు దేవతల ప్రవృత్తు లత్యంతము మానవ నియతిలో కుంచింపరానివి. అందును నర్థవాదములగు పురాణమూలకమగుటచే ప్రాకృతికతలో దీనికట్టి సంకుచితత్వమేర్పడినది. కొండ నద్దములో జూపుచో నిట్టి యాభాస మేర్పడును. నిజమున కేదో విధముగ నట్టి యాభాసమే కాదా కావ్యమున కేమి, కళల కేమి సర్వసృష్టికే హేతువగుచున్నది.

# పిచ్చికగూడు

— శ్రీభాగి నారాయణమూర్తి

ప్రొద్దున్నే కాఫీపుచ్చుకొని బయలుదేరాను. స్నేహితుల్ని వెంబడివేసుకొని, వీధివీధీ, సందుసందూ కాళ్ళు కదుములు కట్టేటట్లు తిరిగి, సాయంత్రమయ్యేసరికి యుద్ధంలో విజయం చూరగొనివచ్చిన యోధుడిలాగా, వికసించిన మొహంతో, ఇల్లు చేరుకున్నాను.

ఓరగా వేసిన కిటికీ తలుపుల సందులోనుంచి పిచ్చిక పిల్లలాగా నాకోసమై యెదురు చూస్తున్నది పద్మం. నే రావటం అడుగులచప్పుడుపట్టి గ్రహించి వుంటుంది. వెంటనే వీధిగుమ్మందగ్గరకు ఉరికింది. నేను గుమ్మంలో కాలుపెట్టడం లోగా గొళ్ళెం విడిపోవటం ఒక్కసారిగా జరిగినాయి. నుదుటి మీదనుంచి చెంపలమీదికి జారిపోతున్న చెమటను కుడిచేతి చూపుడువేలుతో తుడుచుకుంటూ, చిన్న నిట్టూర్పుతో ఇంట్లో ప్రవేశించాను. కోటు 'హాంగర్'కు తగిలించి, చెప్పులు విప్పి, దొడ్లోకి వెళ్ళి కాళ్ళుచేతులు కడుక్కొని పడక్కుర్చీలో కూలబడ్డాను. కాళ్లను పడక్కుర్చీ చేతులమీద నిగిడ్చి, నిమీలిత నేత్రుణ్ణయి రేగిపోయిన క్రాపును కుడిచేతి వేళ్ళతో సర్దుకుంటూ "చల్లటి మంచినీళ్ళు కావా"లన్నాను, పద్మం వైపు తిరగకుండానే. నేను పురమాయింపకముందే ఆపని మీదే వంటింట్లోకి పోతున్న పద్మం తొందరగా కంచు గ్లాసుతో మంచినీళ్లు తీసుకొని హాజరైంది. మంచినీళ్లగ్లాసు

అందించి ఆ చల్లటి చేతులు పాదాలమీద వేసింది. ప్రాణాలు లేచివచ్చినాయి. ఆ క్షణానికి కాళ్ల నెప్పులన్నీ మటుమాయమై పోయినాయనిపించింది. పద్మం పాదాలువత్తుతూమధ్యాహ్నం భోజనం యెక్కడ చేశారని అడిగింది.

భోజనం చేశానని చెప్పాలో చేయలేదని చెప్పాలో తోచలేదు. చేయలేదని చెప్తే ఆ వేడి గుండెల పిల్లమనసు నొచ్చుకుంటుందేమోనని మౌనం వహించాను.

"స్నేహితులింట్లో భోజనం చేశారా?—భోజనానికి రానివారు రానని చెప్పకూడదూ."

'కొంపతీసి నా కోసమై భోజనంచేయకుండా కని పెట్టుకొని కూర్చోలేదుకదా!' అన్నాను. ఆదుర్దాతో పద్మం ముహం తేరిపారచూస్తూ, భోజనం చెయ్యలేదనే భావం వ్యక్తపరుప దలచుకొన్న మూకాభినయంతో జబాబు చెప్ప కుండానే, తలకాయ వంచుకొని పాదాలు వత్తుతూ నిల్చున్నది. కాని ఆ బిగించిన పెద్దవుల్ని తోసుకవస్తున్న చిరు నవ్వూ— ఆ నిర్మలమైన కళ్లల్లో తేరుకుంటున్న ఛాయలు— రూఢిగా భోజనం చేసిందనే చెప్పటంవల్ల ఆ ప్రసంగం చట్టుక్కున మార్చేశాను.

పద్మానికి ఆశాభంగం కలిగింది.

నాలోనేను నవ్వుకుంటూ—ఇల్లు కుదిరిందన్నాను.

పద్మం మాట్లాడలేదు.

అద్దె యెనిమిది రూపాయలు—నీళ్ళకు రూపాయి

న్నర — దీపాలకు రెండుంబావులా — అవుతుంది అంటూ సాగించాను.

'బాబో 12 రూపాయలుదాకా ఇంటి అద్దెకే పెట్టితే మీకొచ్చే 40 రూపాయలతో యేం కాపరం చేస్తామండి,' అన్నది పద్మం. నేను చాలా తెలివి తక్కువపని చేశానని అర్థమిచ్చే చూపులతో నా వంక చూస్తూ.

యేం చేస్తాం మరి అద్దెకొంపల కరువురోజులివి. ఏ చెట్టు కిందనాన్నా గుడిసెవేసుకొని కాలం వెళ్ళబుచ్చుకునే అదృష్టం మన మొహాన రాయలేదు. భగవంతుడు — మనల్ని ఆ తెగలో పుట్టించలేదు.

'యెన్నిగదులున్నాయి?'

'యెన్ని గదులు కావాలి ఒక జంటకు. రెండుగదులున్నాయి. ఒకటి చిన్నది. ఒకటి పెద్దది—ముందు చిన్న వరండా వున్నది. నీళ్ళకు వేరే ప్రత్యేకం కొళ్ళాయి (నల్లా) లేక పోయినా ఆట్టే వత్తిడి వుండదు — సదుపాయాలన్నీ చూసే తీసుకొన్నాను.'

'అయితే ఆ యిల్లు తీసుకోటం ఖాయమేనా?'

'అంటె.........! బజానాకూడా యిచ్చివచ్చాను!

"ఏమొచ్చిందండి అంత తొందర? మొన్న మన యింటి ప్రక్కన మంగమ్మగారు చెబుతుండే సీతన్నగారి తోటలో ఆరు రూపాయల భాగాలు అద్దెకున్నాయని"

"ఏం తొందర వచ్చిందంటే తొందరకాకపోతే మరేమిటి? ఇంకా 10 రోజుల్లో యీ ఇల్లు ఖాళీచేయాలాయె—

నేనీ అద్దెకొంపలకోసం యెక్కడ వేటాడుతూ కూర్చోను—నీకు వారానికి ఒకరోజు—ఆదివారం. తీరిక దొరుకుతుంది. ఆ ఆదివారం కాస్తా జారిపోయిందంటే మళ్లీ వారందాకా బయటి ప్రపంచకం చూసేటందుకు వీలుండదు —ఇప్పుడు తీసుకొన్న యీ యిల్లు మా ఆఫీసుకు దగ్గరకూడా వున్నది''

" అదీ......! ఇంకేం...ఇరవై నాలుగు గంటలూ మీరు ఆఫీసులోనే వుండవచ్చు...అయితే యెప్పుడు కొత్త యింట్లో ప్రవేశించటం?''

' దానికి పంచాంగం చూడాలాయేమిటి?—వచ్చే ఆదివారం!'

" ఆదివారంకంటే మంచిరోజు మా మతంలో లేదు. అది పర్వదినం.''

'మీామతం యేమిటి? కొత్తగా మతంపుచ్చుకున్నారా యేమిటి?' అంది పద్మం—కుడికాలి బొటనవ్రేలు మెటికె విరుస్తూ పొరలివచ్చే నవ్వును బిగించిన పెదవులతో అదిమి పెట్టుతూ.

' అవును బానిస మతం అన్నాను. నిమీలిత నేత్రుణ్ణయి.

* * *

ఆదివారంనాడు తెల్లవారుఝామునే లేచి వంటచేసింది పద్మం. భోజనముచేసి పెందరాడే, నూతన వసతి గృహప్రవేశానికి సకుటుంబంగా సన్నిద్ధుడనైనాను. రెండెడ్ల బండిలో సామానంతా సర్దాము. ఒంటెద్దు పెట్టె బండిలో

ఊరగాయల జాడీలూ, గాజుసామానూ పెట్టుకుని కూర్చుంది పద్మం. రెండెడ్లబండి పక్కనే, లాంతరు పట్టుకుని, సామాను పడిపోకుండా చూస్తూ నడుస్తున్నాను.

" అక్కడే! ఆ లాంతరుస్థంభం దగ్గరే... ఆపుకో బండి" నంటూ బండివాడిని హెచ్చరిస్తుంటే, పద్మవిని, పెట్టెబండీ, పరదాలతొలగించి తొంగిచూసింది. ఆ ప్రాంతాల యెక్కడా మేము వుండేందుకు నివాస యోగ్యమైన చిన్న ఇళ్ళువున్నట్లు కనిపించలేదు. బండి ఆగింది. పద్మం దిగింది. 'యెక్కడ ఇల్లు' అని అడిగింది.

'అదేం, ఎదురుగుండా కనబడటల్లేదు' అన్నాను.

"ఆ మేడా!" అంటూ అనుమానంతో నన్ను చూసింది.

'వెళ్ళుతున్నాంగా' అంటూ ఇంటివైపు నడకసాగించాను. నన్నంటి పద్మం అడుగు వేస్తున్నది!

ఆ ఇల్లు పూర్వకాలపు మట్టిమేడ.

మేడమట్టుకు చాలా పెద్దది. అందులో పది కాపురాలున్నాయి. కాని నేను తీసుకొన్న భాగం మట్టుకు తక్కిన వాటితో సంబంధం లేనిది.

వీధిగుమ్మందాటి చీకటితో నిండిన యిరుకువున్న సందులోంచి కొంతదూరం పోవాలి, నే తీసుకొన్న భాగం చేరేందుకు. నాలగడుగులు వేసి యెక్కడికీ పోవటం అంది పద్మం. 'భూతగృహం కాదులే అన్నాను. ఆ చీకట్లోపద్మం

ముఖం స్పష్టంగా కనపట్టం లేదుకాని ఆ స్వరంతో యేదో విషాదచ్ఛాయలున్నట్లు మనసుకు తోచింది. ఇంకా నాలు గడుగులు వేసిం తరువాత, నే నద్దెకు తీసుకొన్న భాగానికి దారితీసే వలయాకారంగావున్న మెట్లపంక్తిని చేరుకున్నాము.

"యేమిటి యిది ఇల్లేనా, గాలిరాదు వెలుతురు లేదు. యీ దుమ్ము యీ బూజు, పిచ్చికగూళ్లలాగా యేమిటి మొత్తంమీద చాలా మంచియింటినే సంపాదించా"రంటు కుడిచేత్తో స్తంభాన్ని పట్టుకొని మెట్టుమీద కాలుమోపింది.

అది వలయాకారపు కర్రతో చేసిన మెట్లపంక్తి. పద్మం కాలుమోపేటప్పటికి మెట్లుకొన్ని వూగిసలాడినయి. దాంతో, అదివరదాకా, పద్మం మనస్సులో తేరుకుంటున్న తలపులు ఒక్కసారిగా పై కుబికాయి. ఈ యింట్లో నేను కాలుపెట్టనండి' అంది పద్మం, నిక్కచ్చిగా పద్మంకళ్ళు చెమ్మగిల్లాయి. వాకిట్లో సామానుపెట్టుకొని యింట్లో ప్రవేశించనని పట్టుపట్టిన పద్మం తరహా నాకేమీ బోధపడ లేదు. నాకు కోపంకూడా వచ్చింది. అయితే, యీ సామాను వేసుకొని యెక్కడికి పోదామన్నాను, కొంచెం కఠినంగా.

పద్మం మాట్లాడ లేదు. కన్నీళ్ళు, ముత్యాల్లాగ చెంపల మీదుగా జారిపడుతున్నాయి. ఆ స్థితిలో నేనేం చెయ్యాలి?

ఇంట్లోకి పద్మాన్ని బలవంతంగా రెక్కపట్టుకుని లాక్కెళ్ళనా. అంతపనీ చేసేందుకు నాకు గుండె లేదు. బండ్లనిండా సామాను, నడివీధిలో పెట్టుకొని యెక్కడికి పోవాలి. వున్న

ఇల్లు ఖాళీచేసి వచ్చానా యె ఇంటియజమాని అప్పుడే తాళం కూడా వేసుకొనిపోయి వుంటాడు. ఒక్కనిమిషంసేపు అట్లాగే నుంచున్నాను. పద్మానికి ఇల్లు చూపించకుండా తీసుకోటం చాలా పొరపాటే అయింది. ఆఖరికి మనసు కుదుటపర్చుకుని.

పద్మం నీవుమాత్రం కంటతడితో ఈ యింట్లో కాలు పెట్టవద్దు. వచ్చినదారినే వెళ్ళుదాం పద. యెట్లాగో ఆ యజమాన్నే వేడుకుంటాను. ఇంకా రెండుమూడు రోజులు, నీకు వచ్చేయిల్లు దొరికేటంతవరకూ తలదాచుకుందుకు అవకాశ మిమ్మని. ఆఫీసుకు సెలవుపెట్టయినా ఇల్లు వెతుకుతాను.

ఈ మాటలు వినేసరికి చీరకొంగుతో కన్నీళ్ళు తుడుచు కొని, నే నంత అవ్యక్తురాలను కాదంటూ, త్రాచుపాము లాగ, నన్ను తోసుకుంటు మేడ మెట్లెక్కింది.

ఆ పలుకులు నా హృదయం మీదకూడా దెబ్బల వాతలువేసినాయి.

పద్మం ముందుపోయి ముందుగది గొళ్లెం తీసింది. పై వెలుతురు కిటికీ ( Ventilators ) మూసి వుండటంవల్ల చీక టిగా వున్నగది నాలుగుమూలలు కనబడేటందుకు, చేతిలోని లాంతరు వెలిగించాను.

*　　　*　　　*

రోజూ నేను 9 గంటలకే భోజనంచేసి ఆఫీసుకు పోయే వాడిని. మళ్ళీ నేను ఇంటికి వచ్చేవరకు పద్మం బిక్కుబిక్కు మని ఒక్కతే యేదో పుస్తకం చదువుకుంటోనో యేదో అల్లు

కుంటానో వుండేది. ఇరుగు పొరుగు సంపర్కంలేదు. పద్మా
నికి చాలా అపచారం చేస్తున్నాననిపించింది. పద్మానికి
తెలియకుండానే అనుకూలంగావుండే ఇంకో యిల్లువెదకడం
ప్రారంభించాను. యెక్కడ దొరుకుతాయి ఇళ్లు, పట్టణాల్లో;
అద్దెకొంపలు దొరకటమంటే ! మార్కాటుకుపోయి కూరలు
పట్టుకురావటమా?

ఆనాడు ఉగాది. ఆఫీసుకు సెలవు. సోమవారం సెలవు
యిచ్చాడు మా హెడ్ క్లర్కు. భోజనంచేసి— భుక్తాయాసం
తీరేందుకు ముందటిగదిలో చిరుచాప వేసుకు పడుకున్నాను.
పద్మం ప్రక్కనే కూర్చొని చెలియలికట్ట చదువుతున్నది
అట్లాగేవింటూ పడుకున్నాను. నాకు యెప్పుడు నిద్రపట్టిందో
తెలియదు. కళ్ళు తెఱచేసరికి నాలుగు కొట్టారు.

'పద్మం నాకు చక్కని కలవచ్చింది దాని అర్థం
యేమిటో నీవు చెప్పగలవా? అంటూ కళ్ళు తెరిచాను.

కళ్ళు తెరవటంతోనే రెండు యెండిపోయిన గడ్డిపర
కలు కొంచెం పురికొసపీచు నా యెదురురొమ్ముమీద పడ్డాయి.
యెక్కడినుంచి యీ గడ్డిపరక లొచ్చినాయో నాకు బోధపడ
లేదు. యెడం ప్రక్కకు తిరిగి చూసేటప్పటికి, ఒక కుప్పగా
పడివుంది. యెండిపోయిన గడ్డిపరకలు, పురికొసపీచు, ఇంకా
యేమేమో సన్నగా చీల్చిన చెత్త.

ఇంటికప్పువైపు చూశాను యేమీలేదు. యెక్కడి
నుంచి వచ్చిందబ్బా యీ చెత్త అని అనుకుంటూ వుండగానే
ఓ పిచ్చుకల జంట రెండు గడ్డిపరకలను ముక్కుల్తో కరుచు

కొనివచ్చి, కొంచెం కిందగావున్న అద్దదూలంమీద పెట్టి ఇటుఅటుచూసి రివ్వుమని యెగిరిపోయినాయి. ఎగిరిపోతూండగా వేసిన రెక్కల గాలికి ఆ రెండు గడ్డిపరకలు కిందికి జారిపోయినాయి. ప్రతిసారి అవి తీసుకొచ్చి పెట్టటం ఆగడ్డి పరకలు జారి కిందపడిపోవటం, ఆ దూలం వెడల్పు లేనిమూలంగ. వాటి పిచ్చికాకపోతే దూలం నడమధ్యగా పెట్టితే కూడు నిలుస్తుందా, అటుఇటు ఆధారం లేనప్పుడు యెన్నిసార్లు అక్కడ పెట్టిన గడ్డి కింద పడిపోతున్నవో మళ్లీ అక్కడే కూడు పెట్టుకొనేందుకు ప్రయత్నిస్తాయేం, వాటి మనఃప్రవృత్తి నా కేమాత్రం బోధపడ లేదు. వాటి విఫలప్రయత్నంచూస్తే నాకు జాలేసింది.

'పద్మం.' ఆ చీపురుకట్ట యిట్లా తీసుకరా! అన్నాను పరధ్యానంగా ఆలోచిస్తూ—చదువుతున్న పుస్తకంకాస్తా చటుక్కునమూసి, నా ముఖంవేపు చూస్తూకూర్చుంది. నా ధోరణి పద్మానికి యేమాత్రం అర్థంకాలేదు. సాధారణంగా చెప్పతీసుకురమ్మంటే యే తేలు వచ్చిందో అనుకుంటాము. కర్రతీసుకురమ్మంటే పామేమైన వచ్చిందేమోఅనుకుంటాము. చీపురుకట్ట తీసుకరమ్మంటే యేమొచ్చిందనుకోవాలి? దయ్యం పట్టిన వాళ్లని చీపురుకట్టతో మంత్రిస్తే, దయ్యం పారిపోతుందంటారు. కాని అది అంతగా అనుభవంతో చూసే విషయంకాదు. అయినా యిక్కడ యెవ్వరికి దయ్యంపట్టింది?

'అబ్బాబ్బ, చీపురుకట్ట తీసుకురమ్మంటే అట్లాగే కూర్చున్నావు యింకా' అని కొంచెం విసుగుతోఅన్నాను.

'ఎందుకండీ చీపురుకట్ట' అంది పద్మ ఆదుర్దాతో.

'చెప్తాగా, చీపురుకట్ట తీసుకురమ్మంటే' అంటూ కసిరాను. చటుక్కున లేచి ప్రక్కనున్న స్టూల్ తీసుకొచ్చి దూలం కిందుగా వేశాను. ఇంతలోకే పద్మం చీపురుకట్ట తీసుకొచ్చింది. రెండు పొడుగాటి చీపురుపుల్లలు తీసి మధ్యకు విరిచి ఆ దూలం పైకి పైనున్న వాసాలగుండా దూర్చి పందిరిగా వేశాను. గాలికి గడ్డిపరకలు క్రింద పడిపోకుండా 'ఇందుకా!' అంటూ పద్మం నవ్వింది 'చెప్పేమాట సన్యంగా చెప్పకూడదు. గాబరా పుట్టించారు. ఇవ్వాళ మీ కంట పడ్డది యిది. నెలరోజులనుంచి మాటి మాటికి ఇల్లు ఊడవలేక నేను చస్తున్నాను.'

వారం తిరిగేటప్పటికల్లా పిచ్చికగూడు పూర్తిగా తయారయింది. మళ్లీ ఇంకోవారానికల్లా రెండు పిచ్చికపిల్లలు కిచకిచమంటూ గూట్లోనుంచి తొంగిచూడటం మొదలు పెట్టినాయి.

ఇప్పుడు పద్మానికి రోజల్లా వాటితో కాలక్షేపం.'

* * *

ఒకనాడు ... ...

'చూడండి—ఆ పిచ్చికపిల్లలు చూడండి. తల్లి యెల్లా పిటికి ఆహారం పెట్టుతున్నదో —అయ్యో ... అయ్యో... లకపిడతల్లాగ వాటి నోళ్ళు చూడండి. తల్లికోసం గిజగిజా తన్నుకోటం చూడండి. అంటూ పద్మం వాటివంక చూస్తూ

పరవశురాలై పోయింది. అప్పుడు పద్మం కళ్ళల్లో తాండ
వించే మాతృహృదయం నన్ను దేవలోకానికి లాక్కెళ్ళాయి.

వాటికి యెంత సహాయం చేశారు. ఎంత పుణ్యం కట్టు
కున్నారు! అంది పద్మం నా కళ్ళల్లో చూస్తూ పిచ్చిక కూన
ల్నించి దృష్టి మరల్చి పద్మం కళ్ళల్లో చూస్తూ...నిజంగానా!
....అన్నాను సిగ్గుతో. పద్మం నా వక్షస్థలంమీద అట్లాగే
వొరిగిపోయింది. జడలోని మల్లెపూవులవాసనలతో నా తల
దిమ్మెత్తిపోయింది. యెంత సేపు నేనా అవస్థలో వున్నానో—
ఒక క్షణమో? ఒక యుగమో?

'పద్మం! ఇంకోయిల్లు చూడమంటావా? యీ
పిచ్చిక గూట్లోనే వుంటావా!' అన్నాను కొంటెగా.

'చాలెద్దురూ!' అంటూ నవ్వుతూ జడలోనుంచి
జారిపోతున్న మల్లెపూవొక్కట్టి నా మొహంమీద విసరింది.

ఆ మల్లెపూవుల తావిలో మా నవ్వుల సిరులు కలసి
పోయి గదంతా చుట్టుకున్నాయి. ఆ గదంతా నిండిన ఆనంద
తరంగాల్లో ఆ పిచ్చిక కుటుంబం వుయ్యాల లూగింది.

# తిక్కన కవితా ప్రతిభ

( ఉత్తరాపరిణయము )

—వెల్దండ ప్రభాకరరావు

రాజరాజనరేంద్రస్థాన మలంకరించిన మృదుమధుర రసభాసురసవార్ధవచనరచనా విశారదుడునగు, వాగనుశాసనుఁడగు నన్నయ భట్టారకుడు నవరస భావానుబంధబంధురముగ నా సభాపర్వముల నారణ్య పర్వార్ధమును రచించిన తరువాత మనుమసిద్ధి యాస్థాన కమలాకరా భాస్కరుడును నిస్సీమసాహితీ పటలభాసమానుండును, సోమయాజియును హరిహర ప్రసాదిత కవిత్వ తత్త్వనిరతిశయానుభావానంద భరితాంతఃకరణుడును, యమాత్యశేఖరుడును కవిబ్రహ్మయునగు తిక్కన మిగిలిన పదేను పర్వములు రసోచితముగ నాంధ్రీకరించిన దెల్లరకు తెల్లమే. అందును విరాటోద్యోగములే యాతని యప్రతిమాన కవితా ప్రతిభయంతయు వ్యక్తముచేయుచున్నవి. కథాకథనమందుగాని పాత్రపోషణమందుగాని, వర్ణనా వైచిత్రియందుగాని యాతడెవ్వరికిని తీసిపోడు ఉత్తరపరిణయముపైన ప్రశంసనా లేశము గావించుటే యీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

పాండవు లజ్ఞాతవాస వత్సరము విందులట్లు మత్స్య తస్త్రసాలాభ్యంతర గృహమున గడపిరి. వారి నియమిత కాలము పూర్తియయ్యెను. వారు ప్రచ్ఛన్న నామధేయులయి

యుండి ఉత్తర దక్షిణగోగ్రహణముల గావించి నుత్తరునికి అర్జునుడు తన నామాదుల తెలిపి వానిని తగు కాలమువరకు ప్రచ్ఛన్నముగ నుంచుమని కోరినాడు. తిక్కన రచనలో నానాటి యాచారవ్యవహారములు, దేశిపలుకుబడులు కన్పించును. ఉత్తరపర్వణాయ భాగమున

'తెలుపులగు చీరలను బూఁ
తలఁ బువ్వులనొప్పి రాజతనయానుగుణో
జ్జ్వల మాననీయ వేషము
లలవడఁ గూడుకొని నగరికరిగిరి ప్రీతిన్.

పై పద్యములో 'తెలుపులగు చీర'లను చోట ధౌత వస్త్రములని యర్థము చెప్పుకొనవలెను. కాని నేడు 'చీర' అనునది స్త్రీధరించు వస్త్రవిశేషములనే రూఢిచెందినది. పూర్వము 'చీర' శబ్దము స్త్రీపురుష వివక్షలేక ప్రయుక్తమగు చుండెడిదని గ్రహింపవచ్చును. తరువాత 'బూతలఁ బువ్వులనొప్పి' అనుటలో బురుషులు సైతము కస్తూరి, జవ్వాది చందనాదుల నలందుకొనెడివారని తెలియుచున్నది. అంతేగాక, పూలను సైతము ధరించెడివా రనియు చెప్పబడినదిగదా!

అర్జునుడు ధర్మరాజు నెఱిఁగించుచు "ఈ చిఱుత గద్దియకుం దగడే నరేశ్వరా" యన్నాడు "చిఱుత" యనునది సామాన్య శబ్దముకదా! చిఱుతఅను శబ్దమందున్న శక్తి యనిర్వచనీయ మైనది.

'చిఱుత' అనగా 'చిన్న' అని యర్థము. ఇచటి సందర్భమునుబట్టి తిక్కనభావము గ్రహింప బూనినచో 'చిఱుత' యనగా నంతటి ధర్మరాజునకే సింహాసన మొక లెక్కయా యనియు, నీ గద్దియ స్వల్పమైనదనియు నీచమైన దనియు నర్థమును పొదిగించినట్లు వ్యక్తమగును.

దేవేంద్రుని సింహాసనమునకు మత్స్య క్ష్మారమణుని సింహాసనమునకు కుక్కకు కంఠీరవమునకున్న సామ్యమేకదా! అందుకే 'చిఱుత'లో నీచత్వ మారోపింపబడినది. అర్జును నితో నిట్లు పలికింపవచ్చునా 'కడుపులో చల్ల కదలకుండ' విరాటరాజ భవనంబున విందులట్లు పుణ్యదేవతామానదయా సమృద్ధి నతని నొందుటచే నాతని యండనుండి మరల విరాటరాజు నిట్లు కించపఱుపవచ్చునా యనిన నది ధర్మ రాజు గొప్పతనము చెప్పుట కుద్దేశింపబడినదే కాని వేఱొండు గాదు. అర్జునుడే మరల "నీ కృపవల్ల విందులట్లు అజ్ఞాత వాస వత్సరమున గర్భవాస గుప్తివల్ల గడపితి"మన్నాడు. ఇట్లే కవిబ్రహ్మ తిక్కన వాడిన చిన్న శబ్దములకుకూడ చాల అర్థపటిమ యుండును. ప్రథమమున పాండవులు తమ సంగతి విరాటరాజునకు చెప్పినపిదప నుత్తరుడు భాషించును.

ఆ వచనములలో నుత్తరుని పాత్రపోషణ పాత్రచిత్రణ ఘనమానముగా తిక్కనార్యుడు నిర్వహించినాడు. ఉత్తరుడు సమరాంగణమున రిపుబలముల కోర్వజాలక పిక్కబలమును మాపిన" వీరాగ్రేసర చక్రవర్తి. ఇట్లు పలాయనుడగు నుత్త రుని వివ్వచ్చుడు పట్టుకొని తమ నామధేయాదుల తెలిపి

యాతని నుపాయమున నిరపాయకరమగు సూతకృత్యమునకు జొన్పి ఉత్తర గోగ్రహణము గావించినాడు. కృతజ్ఞతా సూచనముగ తత్కాలముననే పాండవుల నెక్కువ మక్కువతో పొగడి వారలపై విరాటునకు సుహృద్భావము కల్గించినా డుత్తరుడు.

మనస్తత్త్వ పరిశీలనము, సంభాషణలో రచనా కౌశలము తిక్కన కవిత్వములో గానవగు విశిష్టగుణములు. ఈ రెండు నుత్తరుని వచనములో మనము చూడగల్గుదుము.

ఉత్తరున కర్జునుడు షండుడని తెలియును. ఆ హేతువు వల్లనే జనకుడు సమరప్రకారమడిగిన "దేవసంజనితుడు నాగ న్వర్ణమగు మహాత్ము డొక్కరుం డని నను గాచె గౌరవుల నందఱ గెల్చె మరల్చె గోవులన్" అని చెప్పియున్నాడు. ఇం దర్జునుని దేవసన్నిభుడని చెప్పుటలో విశేషమున్నది. అర్జునుడు సంక్రందన నందనుడు. పందికై ఫాలాక్షునితో పోరిన వీరుడు.

కృష్ణభగవానునకు బావమఱంది. ఇంక నంతటి కురు సైన్యము నెదిర్చి గోగ్రహ నివర్తనము గావించి యద్భుతముగ ప్రవర్తిల్లెను. కావుననే దేవసన్నిభుడను పద మాతనికి తగియున్నది. శబ్దములకింత యర్థపటిమ గల్గించుటలో తిక్కనదే యగ్రహస్తము.

ఉత్తరుడు వచించుచు నర్జునుడే కురుబలముల నిశిత శర పరంపర కోర్వగల్గెను. నాబలమెంత? నన్నుచిత ప్రియభాషల సూతకృత్యమునకు జొన్పి తమ నామధేయాదుల తెల్పి దానిని కొంతకాలము వఱకు ప్రచ్ఛన్నముగ నుంచుమని కోరి

నాడు. అతడు నిరపాయకరమగు సూతకృత్య మిచ్చగ
నేనప్పటి కియ్యకొంటిని. ఆ యుద్ధమందుకూడ కురురాజు పరు
గెత్తుచుండగ నిది జూడనూరకుంటగాదని హెచ్చరించినాడు.
అట్లు సేయుట కిరీటి కొక్కనికే జెల్లెగాని యితరులకు జెల్లునే?
ఈ యుపన్యాసమువల్ల విశ్వచ్ఛునిపై విరాటరాజుకు భగవం
తుండని భావము కల్పించినాడు. దానివల్ల మత్స్యక్ష్మాపా
లుండు పాండవుల శరణువేడి వారల సంతుష్టచేతస్కుల
గావించినాడు. తరువాత మాకీ రాజ్యమీయుదురే దీనిని
నేలుకొనుడు మా కవసరము లేదన్నాడు. మీకేదే నొకవేళ
హాస్తినాపురి కరుగవలసిన యవసర మొచ్చెనేని తగుసహాయ
ముచేతు మనిచెప్పగా నుత్తరుడు విరాటరాజుతో మనకొక
రాజ్యమున్నదా? నన్నుత్తరగోగ్రహణమందు నిన్ను దక్షిణ
గోగ్రహణమందు శాత్రవులోడించుచుండ మనల రక్షించినది
వీరలేకదా! వారలిన్నిరోజులు భస్మసంవృత మహాగ్ని కణం
బులవోలె నుండిరి గావున వారల తేజము తెలిసికొనక తగు
గౌరవము చేయనైతిమి. పరామర్శింపకుంటిమి. కావున
మనస్సు సావధానముగనుండ నేరదు. ప్రార్థనచేయుటమంచిది.
అదియును గాక వారలకు మన మొక నూత్నమగు కానుక
నీయవలె నది యెద్దియను యడుగుదువేని నీ బాలికాలలామ
యగు నుత్తర నలంకరింప బంపుము. "అనెను. ఈ మాట
లలో నుత్తరుని శీలము చక్కగా పోషింపబడినది. ఆమె
నలంకరించిన తరువాత యామె శోభ నొక్క పద్యమందు
హృద్యముగ చెప్పినాడు.

క॥ పదవికిరాజులు గడగిన,
మదనాస్త్రము రేఖపగిది మానిని మెయి చె
న్నొదవ గఝ సేసి రప్పుడు,
ముదితాజనములు ప్రమోదములు లలితముగన్.

ఇందు "పదవికి రాజులు గడగిన" యను పదమెంతయో హృదయంగమంబుగ నున్నది.

తిక్కన కవితలో గాననగు ముఖ్యమైనయొక విశిష్టగుణము సాదృశ్యకల్పనము. ఇది యాతని లోకానుభవమును చాటును. జాతీయములైన యుపమానముల నేకొనును. ఉత్తరనుధారాధర నికరమనోహర పర్జన్య లక్ష్మికి పోల్చినాడు.

ఆమెను తీసికొని వచ్చి అర్జునుని వివాహమాడమన్నాడు. కాని యాతడు మాత్రము నీతిదూరుడా! ఆ యండజయానకు నిండుగ యొక్క యబ్దమాచార్యుడై యుండి నర్తమలికి నృత్యగీతాదులు నేర్పితిని గాన నేనొల్లను. నా కొమారునకు చేసికొందు నన్నాడు. పోనీ తన కుమారుని యంత యేల పొగడవలెనన్న నాతడుకూడ పెండ్లి పెత్తనము నహించినాడు. తన కుమారుడు పండితమ్మన్యుడు కాడని చెప్పవలదా! అతడు సుగుణ రత్నాకరుడని యందఱికిని తెలియవలెను. తన కుమారుడు కురూపియని చెప్పవాడుండునా! ఒక్క వస్తువను గూర్చి చెప్పవలెనన్న దానిని పెక్కువిధములు వర్ణింపవలెను. కావుననే యాతడు గోపాలుని మేనల్లుడు, ఆర్యసమ్మతుడు, విదగ్ధ్యవంతుడు, అత్యూరు తేజుండని చెప్పినాడు. ఆ రోజులలో పిల్లలబుద్ధి విశేషాదు

లెక్కన లెక్కింపబడుచుండెడివి. అత్యూరు తేజుడనగా నాతడు గౌరవప్రదమైన వంశజుడని చెప్పియున్నాడు. ఉత్తర వరింపవలెకదా? మఱి 'కన్యావరయతే రూపం' యని కదా వచనము. దానికి సమాధానము అత్యూరుతేజుండని అనగా ననమాన సౌందర్యమున్ననే యాతని కప్రతిమాన తేజ ముండునని వ్యంగ్యార్థము.

తరువాత వివాహమున కనుకూలములగు సన్నాహ ములు జరిగినవి. శ్రీకృష్ణాదు లరుదెంచిరి. ఈ యుత్తరా పరిణయములో నింకొక చిన్న గాథ కలదు. దుర్యోధనున కొక సందేహము కల్గినది. పాండవుల యజ్ఞాతవాసము పూర్తి కాకమునుపే వారుపోయి వారి నెదుర్కొనిరేమోయని. తన్నింకా నివృత్తికై ధర్మరాజునొద్ద కొక దూత నంపినాడు. వాడును ధర్మజునొద్దకు పోయి యీ విషయము నివేదింప నాతడు "నిండెనాడె సమాబ్దంబులు నిండెనిండెననుము నిక్క ముగన్" అన్నాడు. అతడట్లే యొనర్చినాడు. ఈ విష యము ప్రచ్ఛన్నముగనుంచి తన వారల తెలిసికొన్నాడు. ఈ విషయమును కొద్దిలోనే ముగించాడు. 'నిండెనిండె'యను పునరుక్తిలో నొక విధమైన వైశిష్ట్యమున్నది. ఒక విషయము నిజమని చెప్పవలెనన్న దానిని రెండుమూడు మారులు చెప్పినగాని యది నిజముగ కనపడదు. ఇట్లే భారతములో తిక్కనకవివరుండు విస్తరించి వ్రాయవలసి వచ్చినప్పుడు విస్త రించుచు, గురింపవలసి వచ్చినప్పుడు గురించుచు నాంధ్రీక రించినాడు.

వివాహసన్నాహావసరమున పుర మలంకరింపపడినది. అదికూడ నానాటి దేశ కులాచారానుగుణముగనే క్రముకకాండ మోచాస్తంభములు నాటుట, కుంకుమమునఁ గలయనలికి ముగ్గులిడుట యిత్యాదులు. ఆ పట్టణము వివాహోత్సవమాధవ లక్ష్మికి లలితోద్యానవనంబయి సెలంగె ననుటలో చక్కని యలంకారము పొందించినాడు.

వివాహమునకు ముందు వధూవరులు నొకరినొకరు చూచుకోలేదు. అప్పుడే తెర తెచ్చి పెట్టినారు. మధ్యలో వారికి వినుకలివల్లనే ప్రేమగల్గినది; నలదమయంతులవలె తెరతీసిన వెనుకనే యన్యోన్యావలోకనము ప్రారంభమైనది. ఇచటి పద్యము మనోహరము:

వీనులఁదియ్యమెక్కమును విన్కిఁ బరస్పరరాగ వృత్తిలో
నూనినఁ జూచు వేడుకల నువ్విళులూరెడు నెమ్మనంబు ల
లచ్చోనొక యింత సేపు నెడ సొచ్చుట కోర్వకయుండనున్న య
మ్మానిని యుం గుమారుఁడును మార వికారము లంకురింపన్.

మొదటి యభిమన్యుఁ డా సుందరాంగి ముఖావలోకన గావించి మఱల నా సంగతి యెవరేని చూతురేమోయని తలవాల్చుకొనినాడు. అభిమన్యునకు మాత్రము లజ్జలేదా! ఈతఁడు ప్రథమముననే యామెను తేరిపార జూచినాడు. ఆమె చూపు పాదాంఘ్రులనుండి పైకి యెగబ్రాకుచున్నది. కాంతకు లజ్జా బిడియములుండును గావున నతని నపాంగవీక్షణమున జూచినది. తిక్కనార్యుడు శృంగారరసము చక్కగా పోషించినాడు. "లలిత తనూవిలాసముల"అను హృద్యపద్యములో

అభిమన్యుఁ డుత్తరపాణిగ్రహణము చేయుట పల్లవాచుంబిత మత్తేభ లీలయని చక్కని యుపమానమును పొదిగినాఁడు. ఇప్పట్లు శ్రీహర్షుని గీర్వాణముఁన ప్రియదర్శికా ప్రస్తావనలోని శ్లోకము జ్ఞప్తికి వచ్చుచున్నది. ఇది పార్వతీ కల్యాణమందు వధూవరులే కాననమునందున్నట్టివేళ జరిగిన వధూవరుల (పార్వతీ పరమేశ్వరుల) అన్యోన్యావలోకనము. దానిని జూచియే కాబోలు ఉత్తరాభిమన్యు లేకాసనముపైన నున్నవేళ కోర్కులు 'కెడగూడుకొని' ' అను పద్యము వ్రాసినాఁడు.

ధూమవ్యాకులదృష్టి రిందుకిరణై రాహ్లాదితాక్షీ పునః
పశ్యంతీవర ముత్సుకానతముఖీ భూయో౽ప్రియ బ్రాహ్మణః
సేర్ష్యా పాదనఖేందుదర్పణగతే గంగావధానేవా రే
స్వాన్యుత్పలకాకర గ్రహ విధౌ గౌరీ శివాయా స్తువః.

వివాహము మంగళ సంవిధాన సావధాన పుణ్యాంగన వలనను నృత్యగీతాది వైచిత్ర్య మనోహర వారనారీ జనంబు వలనను వినూత్నరత్నమయ భూషణాది దీప్తవేషవిరాజమానులగు చతురపరిహాస విలాసాదుల వలనను ప్రభూత విభవ విభ్రాతులగు రాజసూనుల మాననీయగరిమా లలిత విహార విశేషంబులవలనను పరమ సంపద్భరితమై ఉత్తరా కల్యాణము పూర్తియయ్యెను. అది యానాటి దేశకాల పాత్రములకు ప్రతిబింబ మేమో?

(7)

# స్వాతంత్ర్య యోగము

—పరిమి వేంకటావధాని

అది బందీ

అందు నేను విహంగ సంతతుల గానమును వింటిని. వేత న్మధురిమ స్వాతంత్ర్య సంబంధి యనికొంటిని.

అందు నేను సెలయేళ్ళ మృదంగ నిస్వనము వింటిని. అందలి లయబ్రహ్మము స్వాతంత్ర్య సంబంధి యనుకొంటిని.

అందొక శుభోదయవేళ కిసలయములయు బాల సూర్యునియు రక్తిమ గంటిని. అందలి రాగము స్వాతంత్ర్య సంబంధి యంటిని.

అటుపై నొక పాతంజలుని యోగశాస్త్రసాధకుని, పంచభూతములనురికియే స్వాతంత్ర్యమును సాధించువానిని, ద్రష్టగానుండ ప్రయత్నించువానిని పరిశీలించితిని. కాని సాధనయు స్వాతంత్ర్యము పరమావధిగా గలదిగా ననుమానించితిని. అది నా మనసున రూఢియైనది.

శరచ్చంద్రుని జ్యోత్స్నలో పరిశుభ్రతకు కారణము పారతంత్ర్య మలినము లేకుండుటని, మయూర నృత్యము నందలి ప్రమోదభావమునకు కారణము పారతంత్ర మలినము లేకుండుటని; పుష్పసౌరభపు వ్యాపనాశక్తికి కారణము పారతంత్ర్య మలినము లేకుండుటని గ్రహించితిని. కాని ఇవన్నియు నాకుద్దీపన విభావములేయై నాలో 'తపము'ను కల్పించెను.

వలనన నేను బందీ నై పోతిని.

నా తాపమును చూచి కొందరు జాలిపడిరి. కొంద రది పిచ్చియని పరిహాసించిరి. కొందరవి అల్లరి గంతులని చిన్నబుచ్చిరి. అన్నవస్త్రములకే కదా ఈ యాత్రమని కొందరు మందలించిరి. కొందరు తపమును మానుమని హింసించిరి. కొందరు నాతోపాటు తపమూనిరి. కాని నా తపము నేనెట్లు మానగలను? నాది విజ్ఞానశోధయంటిని. నాది బ్రహ్మజిజ్ఞాసయేయని యంటిని. వారి కర్ధమగునని నాది స్వాతంత్ర్య యోగమంటిని. అది మోక్షసాధన మంటిని. నన్ను బందిగొన్నవానితో నిట్లంటిని—"నీవు నన్ను చెర బెట్టితివి—అది పాపము—నీ పాపమునకు నేనే తపమాచ రింతును. అదే నా విప్లవము" అని.

నా తాపము అంతటితో తీరలేదు. నా తపమారలేదు—నాతో ననేకులు తపమూనిరి. మా తపశ్శక్తికి ప్రపంచమే సంచలించెన్—తుదకు—

నా శక్తికి నాకే విస్మయ మయ్యెను. నేను బందినైతి నని నేను విషాదగాన మాలపించలేదు. దరిద్రనారాయణుని దారిద్రమనే నేను తడవలేను. ఆతని 'నారాయణత్వమే' అతనికి నేను బోధించితిని. నా ఈశక్తికి కారణ మరయుకొనుచు ధ్యానమూనితిని. ఇట్టివో కలెక్కలోనిది కాదని నాకుతట్టెను. మరింత విస్మితుడనై తీవ్రతరమైన చిత్తవృత్తి నిరోధమును సల్పితిని—నా హృదయమునుండి సమాధానముగా 'తత్వమసి' అని వినబడెను.

# కథానిక

—శ్రీ బూర్గుల రంగనాథరావు

చిన్న కథ లేక కథానిక మనం యితర సారస్వతాల్లో నించి గ్రహించింది కాదని మన పూర్వ సాహిత్యంలో దాని లక్షణాలు పూర్తిగా నిర్వచింపబడటం మూలాన తెలుసుకుంటున్నాము. అగ్నిపురాణంలోని గద్యకావ్య భాగంలో కథానికకూడా చేరిందని ఈ శ్లోకంవల్ల తెలిసికోవచ్చు.

ఆఖ్యాయికా, కథా ఖండకథా పరికథాతథా
కథానికేతి మన్యంతే గద్యకావ్యంచపంచా ॥

అగ్నిపురాణంకన్న పూర్వం దండాచార్యులు అనే అతడుకూడా ఆఖ్యాయిక, ఆఖ్యానము కథ అనే విభాగాలు వున్నట్టు వ్రాశాడని తెలుస్తున్నాది. శ్రీ తల్లావఝ్ఝులవారు కూడా తమ ఏకాదసి, పీఠికలో మనకు కథ, కథానకము, ఆఖ్యానకము ఆఖ్యాయక అనే గద్య విభాగాలు వున్నట్టు వ్రాశారు. కాబట్టి మనకు చిన్నకథ అనేది పూర్వంనించే వస్తున్నది.

చిన్న కథ యిన్నివిధాలుగా వుంటుందని లెక్కించి చెప్పలేము. ఒక్కొక్క కథలో ఒకేదృష్టిగాని కొన్ని దృష్టులుగాని కలిసి వుండవచ్చును. నేడు మన భాషలోకి వస్తున్న కథానికలను పరిశీలిస్తే అవి కొన్ని కల్పితాలుగాను, కొన్ని అనువాదాలుగాను, కొన్ని అనుకరణాలుగాను వుంటున్నాయి.

ఈ ఒక్కొక్క దానిలోనే యెన్నో విధాలయిన కథలు కన పడతాయి. ఇటీవల లింగీయ Sex కథలుగూడా ప్రబలి పోయాయి. బహుశః వీటికి అవసరముకన్న యెక్కువ ప్రాధాన్యత యివ్వబడుతున్నదేమో అనిపిస్తున్నది. ఇంకా అనేకులు చిత్తవిభ్రమం (Fancy) ఎల్ల కలిగే భావాలను కథారూపంలో చిత్రిస్తున్నారు. కథారూపం వున్నా లేకున్నా (Sketches) గల్పికలు వ్రాసిపారేస్తున్నారు. వీరు తమ చిత్తానికి యేమాత్రం చలనం కలిగినా దాన్ని వెనుక వేసుకుని, పగటికలలు కంటూ ఊహా విమానాల్లో యెగురుతూ యిష్టంవచ్చినట్లు విశృంఖల విహారం చేస్తున్నారు. వీరికథల్లో సంకీర్ణత, అస్పష్టత సహజంగా కనిపిస్తాయి. ఈ చిత్తవిభ్రమ కథకులకు విరుద్ధంగా, పరిణత ప్రజ్ఞలు కొందరు కార్యకారణ సహితమైన హృదయంగమ భావప్రోద్బలం (Imagnation) చేత ఉత్తమ తరగతికి చెందే కథలు వ్రాస్తున్నారు. ఆంధ్ర కథక చక్రవర్తు లనదగు చింతా దీక్షితులుగారే యిందుకు నిదర్శనం. టాగూరు, ప్రేంచందు, ఇంగ్లీషులో ప్రిట్ చెట్ మొదలగువారంతా ఈ తరగతి కథకుల్లో చేర్తారు. వీరికథల్లో భావం ఉపజ్ఞ, ఉదాత్తత, స్పష్టత అనే నాలుగు సుగుణాలు సాధారణంగా చదువరులకు కనిపిస్తాయి. ఇంతేగాక సునితమైన పరిశీలనతో, చక్కని ఔచితిని పటించినారు వీరు తమకథల్లో.

హెచ్. జి. వెల్సులాంటివారు అన్యాపదేశమైన కథలు వ్రాస్తున్నారు. ఇవి ఒక విధమైన అవ్యక్తార్థం స్ఫురింపజేసి ఆనందం కలుగజేస్తాయి. పాశ్చాత్యులు (Idealism) ఐడియ

లిజంను ఆదర్శత్వాన్ని కొందరు అనుసరిస్తున్నారు వాస్త వానుభవాన్నే (Realism) చిత్రించాలని మరికొందరంటు న్నారు. అంతకన్న ఓ మెట్టెక్కి, కొందరు సర్ - రియలిస్టిక్ కథలు వ్రాస్తున్నారు. ఇక, హాస్యరస ప్రధానమైన కథలు కొందరు వ్రాస్తున్నారు. అవి మనకు చాలా కొద్దిగా వున్నాయి.. ఇంకా యెక్కువగా కావాలి.

ప్రణయమే ఒకరికి ఉపాదేయమౌతే ప్రళయం ఇంకొ కడికి ఉపాదేయమౌతున్నది. సుఖాన్ని ఒకడుచూస్తే దుఃఖా న్నియింకొకడు చూస్తున్నాడు. దారిద్ర్యం, దాస్యం, బాధలో నులిచి క్రాంతిజ్వాలల సహాయంతో బొల్లివిస్తు మంత్రాలతో బయలుపడే వ్రాతలు వ్రాస్తామంటునా[illegible]. అభ్యుదయ రచ యితలు కొందరు.

ఇన్ని విధాలైన భిన్నభిన్న అభిప్రాయాల్లోను దృక్ప థాల్లోనూ పడి కొట్టుకొంటున్న మన తెలుగు చిన్న కథ యింకా అపక్వస్థితి (Melting pot) లోనే వున్నదని చెప్పాల్సివస్తుంది.

దీనికంతటికీ కారణం గత యుద్ధానంతరం పాశ్చాత్య సాహిత్యంలో వచ్చిన నిరాశ, దానితో కూడివుండే అధిక్షేప వక్రోక్తి పురోభాగిత్వం (Cynicism) యథాదర్శనం నిజ మైన భావనకు మారుగ భావోన్మాదం: ఇవే మన సాహి త్యాన్నికూడా చాలవరకు తారుమారు చేశాయి. అని అనక్క శ్రీ కురుగంటివారితో మన మేకీభవించవచ్చు. కాబట్టి వీటి ప్రోద్బలం (Influence) మన కథానికల్లోకూడా కనపడటం యేమాత్రం ఆశ్చర్యంకాదు. ఈవక్రోక్తి, అధిక్షేపం (Sature

భమిడిపాటి, విశ్వనాథ కవిరాజు రచనల్లో బాగా బహిర్గత మవుతున్నది.

— ♦ ఇంగ్లీషు కథానిక ♦ —

౨౦ శతాబ్దపు ఆంగ్ల సారస్వతానికి చిన్న కథ ఒక అమూల్యాలంకరణం. స్వతంత్రమైన పోకడలతో నూతన మైన ఉపజ్ఞతా నేటి ఇంగ్లీషు సారస్వతాన్ని పెంపొందింప జేసింది. కథానికే అంటే అతిశయోక్తి కాజాలదు. ఒక ఆంగ్ల విమర్శకుడి అభిప్రాయ ప్రకారం ఇంగ్లీషు నవలా వాఙ్మయం సామాన్యంగా శిల్పరాహిత్యమై స్వోత్కర్షా ఫలితమగు అయోమయత్వంలో ప్రాకులాడుతున్నది. కవిత్వంకూడా ఒక విలక్షణలక్ష్యంతో లేదు. ఎందుచేతనంటే కవులు ఒకవైపు(Lyrical లిరికల్ సాంప్రదాయం మరొకవైపు, కవులు తమ సాంఘిక బాధ్యతలను గుర్తించాలనే సూత్రం మధ్యా తంటాలుపడుతున్నారు. మన తెలుగు కథానికగూడా అదే స్థితియందున్నది. కాని పాశ్చాత్య కథానిక మాత్రం తన త్రోవను చక్కగా నిశ్చయించుకున్నట్లు తోస్తున్నది. రాజకీయాలేవిధంగామారినా కథానికను మార్చలేవు. కళయొక్క ఆశయం యేదైనా కావచ్చునుకాని ప్రచారం (Propaganda) మాత్రం యెప్పుడూ కాదు.)

కథానిక పాశ్చాత్య దేశంలో ఒక విధమైన క్రమ వికాసం పొంది చక్కని మార్గాల్లో సంచరిస్తున్నది.

ఫ్రాన్సు దేశంలో మొపాసా (Mapassaunt) రష్యాలో (Anotonchekhov) ఆన్ టన్ చెకోవులసలు కథానికయొక్క

సంపూర్ణ స్వరూపాన్ని, దాని యొక్క అనేక ఉత్కృష్ట గుణాలను లోకానికి వెల్లడిచేశారు. ఆధునిక కథారచయిత లందరూ ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఈ యిద్దరు మహానీయులను అనుకరించి వారినుంచి ఉత్సాహం Inspiration తీసుకుంటూనే వున్నారు. ఈ యిద్దరూ గొప్పవాళ్ళేకాని యిద్దరి రచనలోనూ యెంతో భేదం వున్నది ఇద్దరూ చెరి యొక మార్గాన్ని చూపించారు కథానికకు.

మొపాసాకన్న చెకోవ్, కథల కూర్పులో సిద్ధహస్తుడు. ఇంగ్లీషు కథావాఙ్మయము మొపాసాకన్న చెకోవ్కే యెక్కువ ఋణపడివుంది. చెకోవ్ జీవితంలోని ఒక భాగాన్ని తీసుకుని తనకథాకథన శిల్పంలో గ్రథనంచేస్తాడు. ఈ శిల్పశక్తి అనే సూక్ష్మదర్శినితో మానవ జీవితాల్ని జాగ్రతగా పరీక్షించి పఠితల కళ్ళయెదట నిష్పాక్షికంగా తన పాత్రలను ప్రదర్శించి, ప్రస్తుతాన్ని అధిగమించి పూర్వోత్తరాభిముఖాల్లో యెంతో దూరంవరకూ తన కళాకాంతుల్ని వెదజల్లుతాడు. ఇవే లక్షణాలు ప్రేంచంద్ కథల్లోనూ కన పడతాయి. చెకోవ్ స్వయంగా వైద్యుడుగాబట్టి అతని కళ యెప్పుడూ సశాస్త్రీయమై విచక్షణా యుక్తమై ప్రకృతి తత్వానుసరణియై సహజ చిత్రగతితో ఆనంద సంధాయకంగా వుంటుంది. సశాస్త్రీయంగా వ్రాయజాలని పక్షంలో అసలు వ్రాయడం మానుకుంటానని అతడే ఒకచోట చెప్పుకొన్నాడు.

చెకోవుతోడి, ఆధునిక కథాస్రష్టయైన మొపాసాలో కావ్యలక్షణాలు (Lyricism) యెక్కువగా అగుపిస్తుంది.

కథయొక్క ఆకృతికీ, దాని ప్రతిభాగాన్ని కళావంతంగా చేయడానికి యీ (Lyricl element) చాలాముఖ్యం ఈ (Lyricism కై మొపాసా ప్రత్యేక ప్రయత్న మేమీ చేయలేదు. అతని కథాకథన విధానంలోనే సహజంగా అంత ర్యాభతమై అతడి కళాభిజ్ఞతను శబ్దాల్లో చాటుతున్నది. కాబట్టి మపాసా ఆధునిక కవులకు మార్గదర్శకుడయ్యాడు. ఓహెన్రీ డి. ఏచ్. లారెన్సు బేట్సు మొదలగువా రంతా అతని అనునయూయులే. స్త్రీపురుషుల స్వచ్ఛంద ప్రవర్త నాన్ని ప్రతిపాదించాడు గాబట్టి వస్తుతతః కూడా ఆధునికుల మనస్సులను చూరగొన్నాడు మపాసా. ఇక కథానిక లక్ష ణాలు చర్చించుతాము. కథానికగూడా ఒక కావ్య విభాగమె గాబట్టి ఉత్తమ కావ్యాని కుండవలసిన లక్షణాలే ఉత్తమ కథకుకూడా వుండాలి. అయితే కథానికకు ప్రాయికంగా రెండు బాహ్య లక్షణా లున్నాయని శ్రీ కురుగంటివారు సూచించారు.[1] ఒకటి కథ చిన్నదిగా ఉండడం. రెండవది కథ హాందికగావుండి శబ్దార్థ క్షిప్తతతో కథాశరీరం బిగిసిపోకుండా వుండడం. అభ్యంతర లక్షణాలు మూడు అని మన పూర్వ లాక్షణికులే యేర్పాటు చేశారు. అవియేవంటే ఒకటి: కథలో పఠితను భయసంభ్రమాశ్చర్యాల్లో ముంచేవి చిత్ర సంఘట నాలుండాలె. రెండవది: కథాగర్భంలో హృదయం కరిగించే సన్నివేశం కూర్చాలి. మూడవది పాఠకుల అభిముఖ్యత (Interest) జారిపోకుండా వారు అనుకోని కొత్తమలుపు లతో కథసాఫీగా ముగిసిపోవాలె.[2] బాహ్యలక్షణాల్లో రెండూ

1, 2. నవ్యాంధ్ర సాహిత్య వీధులు

ముఖ్యమే. అభ్యంతర లక్షణాల్లో యే ఒక లక్షణం లోపించినా క్షితి లేదు. అంతేకాదు అద్భుత నిర్వహణవుంటే యే ఒక లక్షణమున్నా పరవాలేదు. కాని ఆ సమర్థత ఆ ఉపజ్ఞ ఆ నిర్వహణం లేకపోతే మాత్రం యెన్ని లక్షణాలున్నా కథానిక కమ్మగా వుండదు. ఈ లక్షణాలే పాశ్చాత్య కథాకర్తలగు చెకోవ్, గాల్స్‌వర్దీ, వెల్సు రచనల్లో భారతీయ రచయితలగు టాగూర్ ప్రేంచందుగారి కథల్లో, చింతా దీక్షితులు శ్రీపాద మొదలగువారి కథల్లోనూ కనిపిస్తాయి.

భావము, వస్తువ, రచన అనే ఈ మూడు అంశాల ప్రాధాన్యత కావ్యానికెట్లో కథానికకుగూడా అంతే. ఇతివృత్తము, లేక కథావస్తువయొక్క విశిష్టత, ఆకథ పఠితల్లో కలుగజేసే ప్రేరణాశక్తి (Compelling Force) పైన, వారికి దానియందుండు ఉత్సాహాభిముఖ్యం (Interest) పైన ఆధారపడి వుంటుంది. ఈ వస్తువును మిక్కిలి రమ్యంగా యోగ్యమైన శబ్దసంగ్రహణంచేతనూ సునిశిత మైన నేయార్థం (Appeal) వల్లనూ చక్కని పాత్ర పోషణాతోడనూ శిల్పాకృతిగా ప్రదర్శించాలి. భావం హృదయాన్ని, వస్తువు చిత్తాన్ని రచన శ్రవణేంద్రియాన్ని ఆనందింప జేస్తాయి. కథానికలో, ఈ వస్తువ అనేది, మానవ మనస్సంబంధమైన ఒక క్రియనేకాని సన్నివేశాన్నే కాని ప్రదర్శించాలి. కథాబీజం ఒకే ఒక ముఖ్యసన్నివేశం (Centric Episode) తో సంబంధించి వుండాలి. రచయిత కళాధినివేశుడైతే అతడు జీవితంలోని ఒక ఘటియనైనా సరే చక్కగా చిత్రించి చదువరుల భావములను పల్లవింపజేసి, వారినే వారివారి సంస్కా-

రాల ప్రకారం ఆ కథను పూర్తిచేసుకునేట్టు చేస్తారు. నిశ్చల మైన ఒక సరస్సులో ఒక చిన్న రాయిని వేస్తే అది నీటిలో చిన్నచిన్న అలలను సృష్టిస్తుంది. ఆ అలలు ఒకదానికన్న ఒకటి విశాలమై గుండ్రంగా వ్యాపిస్తూ బలహీనంగానైనా తాము ఉద్భవింప జేసిన శక్తిని (Energy) ఒడ్డువరకూ అందజేస్తాయి. ఈ శక్తి ఆరాయియొక్క ఆకారము బరువు మీద ఆధారపడి వుంటుంది. అలాగే మన జీవితంలో విసర బడ్డ యిలాంటి కథానిక బహుముఖమయిన మానవ జీవితపు టంచుల నన్నింటినీ స్పృశించాలి.

కథానికలో కావ్యభాష వాడితే జీవకళ చెదిరిపో తుంది. వాడుకభాష వాడడమే చాల మంచిది. చ్యుత సంస్కారం కాని గ్రాంథికభాష వాడినవాళ్ళలో విశ్వనాథ వారిని, చింతా దీక్షితులుగారిని పేర్కొనవచ్చును. తెలుగు నుడికారాలతో సజాతీయమైన భాషలో, ఆయా పాత్రలచేత పలికిస్తూ వాళ్ళను మనం ప్రత్యక్షంగా చూస్తున్నామా అన్నట్టు వ్రాయగల సమర్థులు శ్రీపాదవారు. వీరు కథా కథనంలో సిద్ధహస్తులు. అభిజాత రమణీయమైన భావ్య చిత్రముకు ఉపజ్ఞా సహితమైన భావనకు, వారికథలే నిదర్శ నాలు. ఆ కథలు చదివితే కొంతకాలం జ్ఞాపకం పెట్టుకో లేకుండా వుండలేము. తెలుగుభాషలో వాటికవే సాటి అన్నట్టు వుంటాయి. పాత్రోచిత భాష వాడాలనే సూత్రా నికి కలికితుర్లాయి మన గోఖలేగారు వ్రాస్తారు. వీరు ఒక యెరు కల కుటుంబానికి సంబంధించిన కథ వ్రాస్తారనుకోండి. అట్లా వ్రాస్తే ఆ ఎరుకల భాషనే అచ్చంగా ఉపయోగిస్తారు. అంతే

కాక వాళ్ళ ఉచ్చారణ వాళ్ళనుకీకారం సరిగ్గా అర్థమయ్యేట్లు గుణింతాన్నే వింతగా వ్రాస్తారు. ఇలాంటిభాష వాడితే అందరికీ అర్థంకాదు. ఏ ప్రాంతీయ భాష ఆ ప్రాంతీయులకు మాత్రమే బాగా అర్థమౌతుంది కాబట్టి సామాన్యంగా అంద రికీ అర్థమయ్యే జీవద్భాషే. యోగ్యంగా వుంటుంది. .కథాని కకు వాస్తవలోకాతిక్రమణము రసభావ పూర్తిచే బుద్ధియం దంకురించు వ్యక్తిగత సంస్కార విశేషమునే పాశ్చాత్యులు (Idealism) అంటారు. కాని వారికది ప్రత్యక్షానుభవ విషయంకాదు. తత్సంబంధమైన రసానుభవంకూడా లేదు వారికి. వారి ఆదర్శత్వం (Idealism) ఊహాకల్పితమైంది.''

... "భారతీయుల ఆదర్శత్వం దానికి భిన్నమైనది. భారత ధర్మము నివృత్తి పూర్వకము కావున ఆధ్యాత్మిక జ్ఞానసంపద భారతజాతీయ జీవనముల నావరించి ప్రకృతి గతమై పాదు కొనిపోయినది. భారత కవిత అట్టి సంస్కృతియందు పుట్టి పెరి గిన దగుటచే భారత కవుల (Idealism) ప్రత్యక్షవిషయం.''

ఈ పై వాక్యాలు ము॥ కృష్ణారావుగారి 'సమీక్ష' అనే విమర్శక గ్రంథంలోనివి. వీనివల్లమనం ప్రాచ్యపాశ్చాత్య ఆదర్శత్వాల తత్వభేదం తెలుసుకున్నాం. కవి, తాను నివ సించివున్న ప్రపంచంలోనించి తానుకల్పించిన భావప్రపంచం ద్వారా తాను ప్రత్యక్షానుభవం పొంది తదనురూపానందం పాఠకుడిలో కలిగించాలి. ఉత్తమ కథకుడి ఆదర్శంగూడా యిదే విధంగా వుండాలి. (Arthur Symons) చెప్పినట్లు నేటి కవిత్వంలోనేమి, చిన్న కథలోనేమి మొడతెగని పరిశో ధనా తృష్ణ (A restless curiosity) ఆధ్యాత్మికంగాను

నైతికంగాను పెడత్రోవపట్టడం (A spiritual and moral perversity) ఒకదానికన్న యింకొకటి అతిక్లిష్టతరమూ అతి సున్నితమూ అయిన మెరుగులు పెట్టడం (An Over subtilizing refinement upon refinement) కనిపిస్తున్నది. పాశ్చాత్యదేశంలోని యీ పరివర్తన మన దగ్గరికి కూడావచ్చి వేళ్ళూతన్ని పాతుకు పోయింది. కాబట్టి కథకు ముఖ్యంగా కథాకథన కళకు నీతి, ఆదర్శం వృథాలా అనే ప్రశ్న అప్రస్తుతమయింది. నీతి ఆదర్శం యెప్పుడైతే అప్రస్తుతమై పోయిందో యిహ మిగిలింది రసవాదం. కళకు కళయే ప్రయోజనం (Art for Arts sake) విషయం తీసికోవాలి. కథకుడికి స్వానందమేగాక పరానందముకూడా ప్రాచ్యమూ ఆదర్శమూ అయివుండాలి. ఇతరుల ఆనందంకోసం కాని కళ నిజమైన కళ కాదు. ఇటు నీతి అటు ఆదర్శాన్ని దాటివచ్చి కేవలం కావ్యానందంకోసం ప్రాకులాడారు కొంతకాలం పాశ్చాత్యులు. అప్పుడు సరే బాగానేవుంది. 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దం కావ్యం' అనే దృష్టిలో అని మనమూ వారిని అనుకరించాము. తరువాత బెర్నార్డుషా మొదలగు వారి రచనలవల్ల (Utility Theory) ప్రయోజనావాదం బయలుదేరింది. అంటే యింకో విధంగా లోకకల్యాణం, విశ్వశ్రేయస్కరం' అనే మన పూర్వ సాంప్రదాయానికి దగ్గరగా వచ్చారన్న మాట ఆ వృత్తము (Circle) ముగించుకోని. ఇది ఓ విధంగా బాగానేఉంది.

కథాపరమార్థమేమి? ఏవాఙ్మయములో చూసినా ఏ కావ్య విభాగం చూసినా మానవ నైసర్గిక వికారాలను

కామక్రోధాదులను (Fundamental human emotions) ఆ యితివృత్తం ప్రతిఫలింపజేసి పఠితల చిత్తాలకు హత్తుకు నేట్టు చేయడంతప్ప యింకేమీవుండదు.

## Realism యథాదర్శనం

వాస్తవానుభవ చిత్రంవల్లకూడా ఒక విధమైన ఆనందం కలుగుతుంది. మనకథకుల్లో మునిమాణిక్యం మొక్కపాటి భమిడిపాటి ప్రభృతులు కలిగించిన ఆనందం యిట్టిదే. మునిమాణిక్యం నరసింహారావుగారి కథలు తీసుకోండి. వారు సామాన్య కుటుంబాల్లోని దాంపత్య జీవితాలను ఎంత మధురంగా యెంత సహజంగా వర్ణించారో తెలుస్తుంది. సంసారంలోని తాపత్రయం, చికాకు దెబ్బలాటలు అన్న ప్రేమమయంగానూ వాంఛనీయంగానూ కనిపిస్తాయి. పఠితకు. అవివాహితుడైన పాఠకుడికి వెంటనే పెళ్ళి చేసికొని ఆ ఆనందం ప్రత్యక్షంగా అనుభవించా లనిపిస్తుంది. అట్లాగే ఉత్తమ హాస్య ప్రధానమైన మొక్కపాటి నరసింహశాస్త్రి, భమిడిపాటి కామేశ్వరరావు, సురవరం ప్రతాపరెడ్డిగార్ల రచనలు ఆనందాన్ని కలుగజేస్తాయి.

నేడు యెంతో మంది యెన్నో రకాలైన కథలు వ్రాస్తున్నారు. మన కళ్ళకు కనపడకుండా పోయేవియెన్నో! ఉత్పత్తి బాగానేవుంది. ఉత్పత్తిని కొంచంటపి, రకాన్ని అభివృద్ధిపరచి, దేశీయుల అవసరాలను పూర్తిచేసే కథలు వ్రాస్తే బావుంటుందనీ, ముఖదృష్టి నెలలతో బోల్తా పడవద్దనిన్నీ నవరచయితలకు మనవిచేస్తూ ఈ భాషణ యింతటితో ముగిస్తున్నాను.

హైదరాబాదు రేడియోవారి అనుమతి 20—6—48.

# ఆత్మార్పణం

—భండారు చంద్రమౌళీశ్వరరావు

ఆమె ఓవిచిత్రమైన వ్యక్తి. ఇతరులతో సామాన్యంగా ఎన్నడూ మాట్లాడదు. ఎప్పుడూ గంభీరంగా ఉంటుంది. ఏకభుక్తం. వదనం ప్రసన్నంగా ఎప్పుడు అగుపడదు. ఆమె నంతా 'పంతులమ్మగా'రని పిలుస్తారు. తెల్లనిబట్టలు తప్ప మరే విధమైన దుస్తులు ధరించేదికాదు. మా ఊళ్ళోవున్న పరోపకారిణీ పాఠశాల్లో ఆమె పంతులమ్మ. ఆమె వుండేది సేవాశ్రమంలో. తన జీతంలో నెలకు పది హేనురూపాయిలు మాత్రమే తీసికొని మిగతాది సేవాశ్రమాని కిచ్చేది. అక్కడ వుండే అనాథులకు చేతనైనంత సహాయం చేస్తుండేది. చాలా ధార్మికబుద్ధి కలది. ఆమె వివాహితో, అవివాహితో, విధవో ఎవరికీ తెలియదు. చేతులకుగాజులుండేవికాని ముఖాన ఎప్పుడూ కుంకుమ పెట్టినట్టు తోచదు. వ్రతోవతపైనా ఇత రుల ఇంటికిపోదు. ఆమె చక్కగా సంగీతం పాడ కలిగినా ఎవరైనా పాడమంటే పాడేదికాదు. రోజూ రాత్రి 12 గంట లకు ఏవో కీర్తనలు పాడుతుండేది. అవన్నీ వైరాగ్యాన్నీ దుఃఖాన్నీ సూచిస్తుండేవి. ఆమె, పేరు, పుట్టుపూర్వోత్త రాలూ ఎవరికీ తెలియవు. అడిగినా చెప్పేదికాదు. పురుషు లంటే ఆమెకు మహా అసహ్యం. పలుకరించినా పలుకదు. పైగా కన్నెత్తైనా చూడదు. ఆడవారితో, ముఖ్యంగా చిన్న

పిల్లలతో ఆమె రోజూ ఉదయంపూట ఓగంటసేపు సరదాగా మాట్లాడేది. చక్కటి కథలు, నీతులు చెప్పేది. కీర్తనలుపాడి వినిపించేది. ఆమెకు అధ్యాత్మ రామాయణ కీర్తనలన్నా శంకర స్వాములవారి వైరాగ్య గీతాలన్న ప్రాణం. ఆమె వాటినే ఎక్కువగా పాడేది.

నేను చిన్నతనంనుంచీ ఆమెను చూస్తుండేవాణ్ణి మా చెల్లెలు కమలను పాఠశాలనుంచి ఇంటికి తీసికొనిరావడానికి నే నెన్నోసార్లువెళ్ళేవాణ్ణి పిల్లాణ్ణయినా ఆరోజుల్లోకూడా నాతో ఆమె మాట్లాడేదికాదు. ఆమె పరాకతనాన్ని చూచి లోకులు ఆమెకు పూర్తిగా విద్యాగర్వం ఉందనేవాళ్ళు. ఆమెనుగూర్చి మంచి మాట్లాడేవాళ్ళు కొందరూ, చెడుమాట్లాడేవాళ్ళు మరికొందరూ. ఏ దెలాఉన్నా ఆమె నర్థంచేసికోవడం దుస్సాధ్యంగా ఉండేది. పెద్దవాణ్ణైన తర్వాత నా కామెతో పరిచయం కలుగజేసికోవాలని ఉబలాటం హెచ్చింది. ప్రయత్నించికూడా ఎన్నోసార్లు విఫల మనోరథుణ్ణైనా.

పంతులమ్మగారికి సాహిత్యం అంటే చాలా అభిరుచి ఉండేది. కొంత కృషికూడా చేసింది. మధ్యమధ్య ఆమె వ్రాసిన కథల్నూ, గేయాల్నూ పాఠశాల సంచికల్లో చదువుతుండేవాణ్ణి. మృదువైన శైలిలో చాలా రమ్యంగాఉండేవి, ఆమె భావాలు పోకడలు. కాని ప్రతిరచనా విషాదాంతంగా ఉండేది ఇదే ఆమె రచనలో ప్రత్యేకత.

మా చెల్లెల్ను, కమలకు మేము ఇంటివద్ద వీణచెప్పించే వాళ్ళం. కంఠంకూడా శ్రావ్యంగా ఉండేది. అందువల్ల పంతు

లమ్మగార్కి కమలమీద ప్రత్యేక అభిమానం ఉండేది. ఈ అభిమానాన్ని పురస్కరించుకొనైనా ఆమెతో నేను పరిచయం కలుగజేసికోవాలనుకున్నా. కాని లాభం లేకపోయింది.

ఇంతలో కమల వివాహం నిశ్చయం చేశారు, మా జననీ జనకులు. వివాహానికి రమ్మని ఎంతో బలవంతం చేశాం. కాని, ససేమిరా అంది. పంతులమ్మగార్కి ముసలి ముత్తయిదువు లంటే ఎంతో గౌరవం. కనుక మా అమ్మగార్ని బలవంతం చేసి ఆమెను ఆహ్వానించి రమ్మని పంపాం. ఎంతో ప్రయత్నంమీద 'లగ్న' సమయానికి వస్తానని మాటయిచ్చింది. పెండ్లి కానుకగా ఆమె ఐదు ఆశీర్వచన పద్యాలు వ్రాసికొని వచ్చింది. కాని తాను చదువడం ఇష్టపడక నన్ను చదువమంది. ఆమె నాతో మాట్లాడడం అదే మొదటిసారి. భోజనం చేయకుండానే పంతులమ్మగారు పోవడం కనిపెట్టి, కమల ఎవరికీ చెప్పకుండానే ఆమెను పిలుచుకోరావడానికి పోయింది. ఎంత బలవంతంచేసినా రాలేదనీ, పైగా ఎందుకో విచారంగా కూర్చున్నదనీ, కళ్ళవెంట నీరుకూడా కారుస్తున్నదనీ, కమల తిరిగివచ్చి నాకు రహస్యంగా చెప్పింది. ఆమెకు, మా యింట్లో సరిగా గౌరవం జరుగలేదేమోయని హడలిపోయినా. వెంటనే ఆమె వద్దకు వెళ్ళా. రమ్మని ఎంత బలవంతం చేసినా రానంది. ఒకవేళ మా వల్ల ఏమైనా అపరాధం జరిగితే మన్నించమన్నా. అట్టిదేదీ జరుగనేలేదంది పంతులమ్మగారు. ఇక 'శలవు' అని నమస్కరించి గృహోన్ముఖుణ్ణైనా. వివాహం ఐన రెండుమూడు రోజుల్లోనే నాకూ

పంతులమ్మగార్కి తలవని తలంపుగా సమావేశం కల్గింది. ఒకనాడు సంధ్యాసమయంలో మా ముచేటికేసి వెళ్ళి నేనేవో గేయాలు వ్రాస్తూ కూర్చున్నా. అదే సమయాన ఆమెకూడా ఇద్దరు బాలికలను వెంటతీసికొని అటువైపు వచ్చింది. ఆమెను చూచి నమస్కరించి

"చాలాదూరం వచ్చారు" అన్నా.

"రోజూ ఇల్లాగే పిల్లల్ని తీసుకొని వస్తుంటా" అంది పంతులమ్మగారు. ఇల్లా మాట్లాడుతూనే ఆమె దృష్టి నేను మహా భీభత్సంగా కవిత్వం వ్రాస్తూన్న కాగితాల మీద పడ్డది. వెంటనే ఆ కాగితాలను దాచాలని ప్రయత్నించేశా, నేను వ్రాసే గేయాల్ని ఇంకెవ్వరికీ చూపించేవాణ్ణి కానందు వల్ల.

"మీరుకూడా కవిత్వం వ్రాస్తారన్నమాట"

"అబ్బే లేదండీ! వ్రాయాలన్న అభిలాష ఉంది. అందుకని ప్రయత్నిస్తున్నా"

"ఏవీ! ఆ కాగితా లిలా ఇవ్వండీ"

ఇవ్వటానికి ఇష్టం లేదు. ఇవ్వకపోతే కోపం వస్తుందేమో అన్న సందిగ్ధావస్తతో కొంచెంసేపు అనుమానించి, చివరకు కాగితాల్ని ఆమెకిచ్చా. ఆమె గేయాల్ని చదివి "చాలాబాగున్నవి. ప్రయత్నిస్తే మున్ముందు ఉత్తమరచనాలు వ్రాయగలుగుతారు" అన్నది.

"వ్రాయటానికేం వ్రాస్తాను. కాని సంస్కరించే వారు లేరు. నా రచనలోని లోపాల్ని చూపిస్తే సంస్క-

రించుకోవాలని కుతూహలం. తన కాటుంకరం లేకపోతే...
... ... ... ..."

"నాకు మాత్రం కవిత్వం విషయం, ఏపాటి తెలుసు; ఎవరైనా పండితులవద్దకు పోతే బాగుంటుంది."

"పండితుల దగ్గఱకుపోతే వారు గేయాలంటే మండి పడతారు." అంతటితో మా సంభాషణ ముగిసింది. ఇలాగే మరికొన్ని తడవలు ఆమెతో సంభాషించే అవకాశం లభించింది నాకు. ఊళ్ళో అంతా ఆశ్చర్యపడేవాళ్లు నాతో ఆమె మాట్లాడుతున్నదని, మరేపురుషులతో నూ మాట్లాడేది కాకపోవడంవల్ల కొంతకాలానికి ఆమెకు నేను విశ్వాసపాత్రుణ్నైనా. తరుచుగా పోతు(దేవణ్ణి ఆమె తీరిక సమయంలో ఎప్పుడూ కవితాగోష్ఠి, సాహిత్య చర్చతప్ప మే మితర విషయాలేమీ మాట్లాడేవాళ్ళము కాము. ఆమెతో నాకు కల్గిన సహవాసంవల్ల ఆమె కేదో వెనుక విపత్తుకల్గినదనీ దానిని గుప్తపఱుచుచున్నదనీ, ఆ సంఘటనయే ఆమె నెల్లప్పుడూ కలవరపరుస్తున్నదనీ ఊహించగల్గా. పురుషులంటే పరాకుగా ఉంటున్నప్పటికీ మా క్రిద్దరికీ పరిచయం కలుగ జేసిన భారతీదేవికి అనేకసార్లు జోహారు లర్పించేవాణ్ణి.

పట్నంలో నా మిత్రులు కొంద రాపత్రికను నడిపించే వాళ్ళు. ఉగాదిసంచిక కేదైనా కథను వ్రాసి పంపమని ఉత్తరంవచ్చింది. నేను వంత్తులమ్మగార్నికూడా ఏమైనా వ్రాయమని పార్థించా. మొదట్లో నిరాకరించినా తుదకు ఒప్పుకుంది. రెండుమూడు రోజుల్లో కథనుపూర్తిచేసి చదివి వినిపించిం దిలా.

"ప్రభ జమీందారీ ఇంటిబిడ్డ. చిన్నతనంనుండీ అతి గారాబంగా పెరిగింది. ఇంటికేవచ్చి ఉపాధ్యాయులవారు ఆమెకు సంగీతం, తెలుగుచదువుచెప్పేవారు. మరో పంతులు గారు వచ్చి హిందీ, ఇంగ్లీషు నేర్పేవారు. ఆమెకు 18 ఏండ్లు వచ్చేటప్పటికి ఈ మూడు భాషల్లో చాలా వరకు అరజ్ఞానం కల్గింది. జమీందారుగారు చాలా పత్రికలు తెప్పిస్తుండే వారు. ఆమె ఆపత్రికలనూ, సంచికల్నూ అనుదినం చదివేది. కథలూ, వ్యాసాలూ వ్రాయాలన్న ఉబలాటం ఆమెకుండేది. రాజకీయాలంటే ఆమెకు చాలా శ్రద్ధ. పత్రికలో రాజకీయ విషయాల్ను ఆమె విపులంగా చదువుతుండేది. జమీందారులు ప్రభుత్వంవారూ చేసే దుండగాలనూ, దౌర్జన్యాలనూ ఆమె భరించలేక పోయేది. ఎన్నో తడవలు తండ్రితో, ఈ విషయాల్లో వాదించేదికూడా. జమీందారుగారు ఆమె మాటల్ను లక్ష్యపెట్టేవాడుకాదు.

ప్రభకు 20 వ ఏడురాగానే జమీందారుగారు వివాహ ప్రయత్నాలు మొదలుపెట్టాడు. సమీపంలోఉన్న మరో జమీందారుని కుమారునితో ప్రభవివాహం జరుపాలని నిశ్చయంచేశాడు. ఈ విషయం విన్నప్పటినుండీ ప్రభ దుఃఖంతో కుమిలిపోసాగింది. వివాహవిషయంలో తనను సంప్రతించందే, తండ్రి నిశ్చయాని కొచ్చినందుకూ, తనకు కాబోయే మామగారు క్రూరుడనీ, త్రాగుబోతనీ అపఖ్యాతి పడ్డాడనీ, వరుడు విద్యావిహీనుడనీ—ఇవన్నీ కారణాలుగా ఆమెకు ఆ సంబంధంపై విముఖత్వం కల్గింది. తల్లితో ఎంతో చెప్పింది. తనను ఎందుకు విచారించలేదని వాదించింది

" నా వివాహసమయంలో నన్నడిగిచేశారా? నేనూ మీ నాన్నగారూ సుఖంగా లేమా? తల్లీ" అన్నది ప్రభతల్లి.

" మీకు 12వ ఏటనే వివాహం జరిగింది. అప్పుడు ప్రపంచం అంటే ఏమిటో తెలియదనుకుంటా మీకు. ఆ అజ్ఞానావస్థలో మిమ్మల్నడిగినా ప్రయోజనం ఉండేదికాదు. నాగ్గూడా అదేవయస్సున వివాహం చేయకపోయినారా. ఇప్పుడు చేతులార నా మెడ కోయబోతూంటే నేనెలా ఒప్పుకోవాలి" అన్నది ప్రభ వెంటనే.

ఇలా ఎంత తర్కించినా లాభం లేకపోయింది. కన్నబిడ్డ కన్నీటి ధారలైనా ఆ జమీందారుని కఠిన హృదయాన్ని కరిగించలా. ఇక ప్రభకు హృదయావేదన ఎక్కువైంది. ఇంట్లోనుండి ఎలా తప్పించుకోని పోవాలా అని ప్రయత్నం చేయడం మొదలెట్టింది. బహిరంగంగా పోయే ధైర్యం లేదు. పైగా వీల్లేదుకూడా, యమకింకరుల్లా జవాన్లు కోటవాకిట్లో అహోరాత్రుళ్ళూ పహారాఇస్తుంటారుకాబట్టి ఏమి చేయాలో కొంతకాలం ఆమెకు తోచలేదు. ఆత్మహత్య చేసికోవడం భీరుత్వమే గాక పాపమని ఆ పనినుంచి విరమించింది. ఆలోచించగా ఆలోచించగా ఆమె కో ఉపాయంతోచింది. రాత్రి పూట పెరటి గడపవైపు ఎవరూ ఉండరు. అటునుండి వెళ్ళవచ్చు. "ఎక్కడికి"? అన్న ప్రశ్నకు ఆమెకు సమాధానం దొరకలేదు. ఎండ కన్నెరుగని ఆ కోమలి ఎక్కడికిపోగలదు. ఎవరిదైనా ఆసరా కావలసివచ్చింది. ఎవర్నడగాలి. తన కంత విశ్వాసపాత్రులెవరు? అంతఃపురంలో దాసీలు, సేవ

కులుతప్ప తన కెవ్వరూ తెలియదు. వారి సహాయం అపే క్షిస్తే వారీ విషయం తండ్రితో చెప్పుతారేమో అని శంకిం చింది.

ఇలా మనోవ్యాధితో రేయింబవలూ ఆమె కుమిలి పోతూంటే ఒకనాడు సరిగా అర్ధరాత్రివేళ పెరటివైపున ఆమె కో గానం వినవచ్చింది. అప్పట్లో ఆమెకది అమరగానం అనిపించింది కాని అదేగానం ఆమెకు ప్రళయగానమైంది. ఆమె హృదయంలో ఒక మెరుపు మెరిసింది. ఆశాజ్యోతి తేజరిల్లింది. ఆ గాయకునికే 'ఆత్మార్పణం' చేద్దామను కున్నది. ఆ గాయకునితో ప్రభ ఎన్నడూ మాట్లాడకపోయినా అతనెవరో ఆమెకు తెలుసు.

ఆ గాయకుడు ఆ ఊళ్లో 'గురుస్వామి' అని పిలువబడే వాడు. గురుస్వామి విచిత్రమైన భిక్షువు. అర్ధరాత్రివేళ భిక్షా నికి బయలుదేరేవాడదేమోగాని, ఎవరితోనూ మాట్లాడే వాడుగాడు. ఆయన దగ్గరకు వెళ్ళి భిక్ష నిస్తే తీసికునేవాడు. ఇతడు స్ఫురద్రూపి - యౌవనుడు - కాషాయివస్త్రాలను ధరించేవాడు. ఇతడంటే ఆ ఊళ్ళో జనులు భక్తిశ్రద్ధలు చూపించేవాళ్ళు.

ప్రభ దిగ్గునలేచి మెల్లగా పెరటివైపు వెళ్ళింది. గురు స్వామి పాడుకుంటూ కొంచెందూరంలో నిలువబడ్డాడు. "స్వామీ" అని పిలిచింది ప్రభ. నాడు పూర్ణిమ. చట్టా వెన్నెల. ప్రభ చీకట్లో ఉన్నందువల్ల కానరాక గురుస్వామి ఇటూ అటూ చూచాడు. మళ్ళీ పిలిచింది ప్రభ. గురుస్వామి

కొంచెం అనుమానించి తన పద్ధతికి వ్యతిరేకమైనా ఆమె వద్దకు వెళ్ళాడు. ప్రభ భిక్షంపెట్టుటకు మారుగా అతని పాదాలపై వ్రాలి తన అవస్థనంతా విపులంగా చెప్పి తన నెచటికైనా తీసికొని పొమ్మని వేడింది. ప్రభ దేహం వణికిపోయింది. వెంటనే స్వామి మారుమాటాడక తిర్గిపోయాడు. పోతూన్న స్వామిని పిలిచి భిక్షనిచ్చి మరుదినం అదే సమయాన అదే ప్రదేశానికి రమ్మని ప్రార్థించింది.

ప్రభ తిరిగి తన శయనాగారానికి తిన్నగా చేరుకున్నది. కాని ఆరాత్రి ఆమెకు నిద్ర పట్టలా. స్వామి ఎవరో! ఆయనను భిక్షుకునిగా మాత్రమే ప్రభ ఎరుగును. కులగోత్రాలు తెలియవు తనకు. అతనిని పతనానికి తీసికొని వస్తున్నానేమో యని కంపించి పోయింది. అతనితో తన భవిష్య జీవనంలో సంబంధం ఎలా ఉండనున్నా అతని సహాయానే ఇంటినుండి పోవాలని ఆమె నిశ్చయించుకుంది. మర్నాడు ప్రతిక్షణం ప్రభ కో యుగంగా తోచింది. ఎప్పుడు ప్రొద్దు గ్రుంకుతుందా అని కనిపెట్టికొని ఉంది. ప్రొద్దుగ్రుంకడంతోటే అర్ధరాత్రికోసం నిరీక్షించింది. గడియారం 12 కొట్టింది. పెరటివైపున స్వామిగానం వినవచ్చింది. ప్రభ కట్టుబట్టలతో బయలుదేరింది. పోతూ, పోతూ ఓసారి తల్లిదండ్రులఘాటోలకు ప్రణమిల్లింది.

స్వామి నిరీక్షిస్తున్నాడు ప్రభకోసం. ఎందుకో అతనికే తెలియదు. తన ఉద్దేశం వ్యక్తపరచింది ప్రభ. మొదట్లో ఒప్పుకోలేదు గురుస్వామి, అప్రతిష్ఠపాలౌతామన్నాడు. తనకు

శీలభంగం కలుగుతుందన్నాడు. ఆమెకు సరిగా పోషణ జరుగదేమోయని సందేహించాడు. ప్రభ ఎన్నో విధాలగా బ్రతిమిలాడింది. ఆమె వద్దనున్న ఆభరణాలను చూచి గురుస్వామి కొంత భ్రమపడ్డాడు. అతనినిగూడా మాయ ఆవరించింది. పతితుడైనాడు. ప్రభయే కారణమేమో,

రెండురోజుల్లో వారా ఊరువదలి పట్నం చేరారు. అక్కడ సుఖంగా కాలం గడిపారు కొన్ని నెలలు. ప్రభవద్ద ఉన్న ఆభరణాలు దాదాపు అన్నీ ఖర్చైందాకా ముందు చింత వాళ్ళకు కల్గలేదు. వారిద్దరూ ఆ కొద్దిరోజులూ ఆదర్శ దంపతుల్లా కాలం గడిపారు.

ఎన్నాళ్ళీసుఖం! ప్రభ శాశ్వతసౌఖ్యానికి నోచుకోలేదు. పరమేశ్వరుడామె కొక శిశువునకూడా ప్రసాదించాడు. ఆభరణాలన్నీ ఖర్చయినవి. రోజు గడవడమే కష్టమైపోయింది. ఇక వాళ్ళ జీవనం దుర్భరమైంది. ఆపరిస్థితుల్లో గూడా ప్రభ దిగులుపడలేదు. 'లేమి' ఏమో తెలియని ఆ సుకుమారి ఆకష్టాలన్నీ భరించగల్గింది. ఉదరపోషణకై ఏదైనా మార్గం అన్వేషించమని ప్రభ స్వామిని మధ్యమధ్య మందలించసాగింది. ఇంతకూ ప్రభకు గ్రహచారం చాలలేదు. ఆమె శిశువు వ్యాధిగ్రస్తుడైనాడు. మందిప్పించాలి. స్వామి మాట్లాడడు. కుమారుడు జబ్బుపడ్డప్పటినుండీ స్వామిలో కొంత విపరీత చైతన్యం కల్గింది. ఏదో పరాకుగా ఉంటున్నాడు. బాలుని వ్యాధి ముదిరి ప్రమాదావస్థకొచ్చింది. ఓనాటిరాత్రి బాలుని కేదో మందు త్రాగించి స్వామి, ప్రభా శయనించారు. మధ్యమధ్య లేచి ప్రభ బాలుని చూస్తుండేది.

బాలుడు గురక మొదలెట్టాడు. పేగులు ఎగరడం మొదలెట్టి నవి. అవన్నీ శుభచిహ్నాలనీ, బాలుని తాను మూస్తాననీ, ప్రభ చాలాసేపు మెలకువతో ఉన్నదని ఆమెను శయనించ మన్నాడు గురుస్వామి.

ప్రభ నిద్రించి తెల్లతెల్లవారుతుండగా లేచింది. స్వామి లేడు. శిశువు కదలడూ మెదలడు. విశ్వాసనిశ్వాసలు ఆగి పోయినవి. ప్రభ గోడుగోడున ఏడ్చింది. తన మార్గాన్ని వదలివచ్చి పతితురాలైనాననీ, ఇకముందైనా వెనుకటి మార్గం తిరిగి అవలంబించాలని, అందువల్ల ప్రభను వదలి పోతున్నా ననీ గురుస్వామి గోడమీద వ్రాసి వెళ్ళాడు. తను నమ్ముకున్న స్వామి లేడు. తన గారాబుపట్టి, ముద్దుమూట పంచభూ తాల్లో లీనమైనాడు. ప్రభకు మతి స్థిమితం తప్పింది. బాలు నలా నేవదలి స్వామీ! స్వామీ! అంటూ ఎటో పరుగెత్తింది.''

పంతులమ్మ కళ్ళు అశ్రుపూరితాలైనవి. ఎందుకో నాకే తెలియదు. కళ్ళనీళ్ళు తుడుచుకొని కథను, గా కన్నీళ్ళూ, చించివేసిందా కాగితాలను. నన్ను సమయంలో వెళ్ళమనీ, మళ్ళీ రమ్మని ప్రార్థించింది రుద్ధకంఠంతో. నాకేమీ అర్థం కాకపోయినా గృహోన్ముఖుణ్ణైనా.

# ముష్టి పడుచు

—సింగరాజు లింగమూర్తి

పదునాలుగేడులూ పయిబడ్డనొక బాల
దీనవదనముతోడ తరలింది వీధుల

చినిగినా బట్టల్లొ చెరిగినా జుట్టుతో
చెమటబిందువులెల్ల చిందులాడంగాను

ఎర్రన్ని ఎండలో వడగాడ్పు సుడులలో
నిలుచుండి అడిగింది ఆముష్టిపడుచు

"బాబయ్య బిచ్చము పుణ్యాముంటదినీకు
పట్టెడన్నము బెట్టు నీవైనదొరసాని

కడుపులో ఆకలి కలచివేస్తున్నాది
కళ్ళల్లొ ప్రాణాలు కదులుతూఉన్నాయి"

"ఏళపాళా లేదు అన్నమేదున్నాది
పోయె పిల్లా" అనియె కాపుముసలీ దొరకతె

అంతటా ముష్టిదీ ఆకలీ బాధతో
తడబడెడి అడుగుల్తొ తరలింది ఒకవేపు

"దండమూ దొరసాని దండమూ దొరబాబు
పట్టెడన్నము బెట్టి ప్రాణాలు నిలుపండి

ముందుజన్మలో మీకు బిడ్డనై పుడుతాను
ఈజన్మనన్ గాచి శుభములూ బడయండి"

" రేషనూబియ్యము అర్ధశేరిస్తారు
అందులో సగపాలు జొన్నలో గోధుమలో

ఒకపూట అన్నమూ ఒకపూట రొట్టె
అవి చాలకే మేను అలమటిస్తున్నాము

నీకేమి పెడుదురే నిన్నెవరు తలతురే
పోయిరా వేపడుచ పోయిరావే చాలు!'

గంటలూ తరబడిగ ఇండ్లెన్నొ తిరిగింది
పట్టెడన్నంబైన పెట్టలేదెవ్వారు

సొక్కుచూ సోలుచూ తప్పటడుగులు వేసి
వివశతన్ తలపోసె ఆముష్టిపడుచు

'' "ఏజన్మలో నేను ఏ దోసగుచేశానో
ఈజన్మలో నాది వ్యర్థబ్రతుకయ్యాది "

గుండె దడదడమనగ ఒడలువణకుచునుండి
సోషొచ్చి పడిపోయె ఆదీనబాల

అంతలో నొకకారు అమితవేగము వచ్చి
ఆబాలపయినుండె 'బాంయ్'మనిపోయింది

దానధర్మాలకూ దాక్షిణ్యాదృక్కులకు
పెట్టుపోతలకైన భారతావనియంద్రు !

ఆనాటి దాతలూ ఈనాడు లేరో ?
ఆనాటిభారతీ ఈనాడు కాదో ?

పట్టెడన్నము లేక ప్రాణాలు బాసింది
శాంతికై ఆబాల స్వర్గాని కేగింది

* * *

సత్యధర్మాలైన ధరణిలోనే వేళ
జయమొందలే వనెడి నార్యోక్తి నిజమాయె !

ఈభూమిలోనీకు తావులేదని ఏమొ
కర్మపరిపక్వాన గొంపోయె నీమడే !

# పెరటి చెట్టు

—కస్తూరీదేవి

పోరుపెట్టి ఏడుస్తున్న కళని వదినగారి చేతుల్లోంచి అందుకుని ఆడిస్తూ వరండాలో అన్నగారిదగ్గర కొచ్చింది ఆమె. ఎంత ఆడించినా వూరుకోక మారంచేస్తోంది కళ. ఏదో చదువుకుంటూన్న ప్రకాశ్ కళ ఏడుపుకు చికాకు పడుతూ చెల్లెలివేపు చూసి "రాణీ! దాన్నవతలకు తీసు కెళ్లరాదూ?" అన్నాడు.

"నీ దగ్గిర కొస్తుందట న్నయ్యా!"

"నేను చదువుకోవాలి, యిప్పుడుకాదు."

మళ్లీ చదువులో పడ్డాడు.

"ఏం చదువుతున్నా వన్నయ్యా?"

............"ఏదో కథ"

"ఎవరు రాశారూ?"

"ఎవరో యిందిరాదేవట"

"బావుందా కథ?"

"ఓమో స్తరుగా వుంది."

"ఊఁహూఁలాఁ" అంది రాణీ యీసుగా.

ప్రకాశ్ దిద్దుకున్నాడు."ఏదో ఉంది లే. యీమాత్రం మీరు రాయలేరూ? నిజంగా రాణీ! పగలల్లా వృథాపుచ్చక పోతే చిన్నచిన్న భావాల్తో మీరందరూ కథలురాసి ప్రతి

టించకూడదూ? నాకోరికకు దగ్గట్టుగా మనయింట్లో కథలు రాశేవాళ్ళెక్కరూ లేరు ''

భావనేకాని కర్తవ్యం శూన్యం. రాస్తే హర్షించే వాళ్ళున్నారా అనుకుంటూ అన్నగారిని రంగంలోకిదింపుదామనిరాణి అంనుకుంది.

'' కాస్త చదువుకున్నది వదిన కథలురాస్తే తమాషాగా వుంటుంది.'' ప్రకాశ్ నిట్టూరుస్తూ 'అంత అదృష్టమా!'

''ఓవిధంగా ఆలోచిస్తే ఆవిడరాసేదేమొఅనిపిస్తుంది. ఈ సంసారపు గొడవల్లో ఎక్కడి సాహిత్యం? ఎక్కడి భావాలు?'' ''రాణీ! భావాలంటే లడ్డువుండలా? గట్టిగా చిదుపుతే చితికిపోటానికి,అయినా యీమాత్రపు చిట్టిసంసారానికే తుఫానులురేగి యెదలోని భావాలు యెగిరి పోతాయా?''

'' కాకపోవచ్చు. కాని చేయూతకూడా అవసరం అన్నయ్యా! సాహిత్యసాధనకు ప్రత్యేకం దానికోసంపుట్టిన పుణ్యమూర్తుల కక్కర్లేకపోవచ్చు. ''

'' ప్రత్యేకమంటూ కొంతమంది వుడతారా? ''

'' ఇల్లా అంటావుకాని అన్నయ్యా! రవీంద్రునిలాంటివారి సంగతేమిటి? ఆయన కళ నుద్ధరించటానికే పుట్టాడు. అందుకే ఒకరిచేయూత లేక తన పని నిర్వహించాడు. మాట వరుసకు, వదిన యెప్పుడొక కథ రాసిందనుకో. నీ వామెను ప్రోత్సహిస్తావా?

''ఓ! తప్పకుండా ''

" నిజంగా ? "

" నిజంగా. "

" ఐతే వుండు. వదినా ! నీకథ యేదమ్మా?" అంటూ లోపలికి వెళ్ళింది రాణి. ప్రకాశ్ రెండుమూడు నిమిషాల దాకా చూసి యీసడింపుతో మళ్ళీ చదువుకోటం మొద లెట్టాడు. పదినిమిషాల్లో రాణి పరుగెత్తుకుంటూ వచ్చింది.

" అన్నయ్యా ! వదిన మనయింటికి రాకముందు రాసిన కథొకటుంది. చదవనా ? "

తన చదువు కీ చవటకథ అంతరాయం కలిగించిందని లోలోపల విసుక్కుంటూ పైకి " ఊఁ కానీ" అన్నాడు. " ఇదిగో విను" మని రాణి ఈ క్రిందికథ చదివింది.

ఆవేళ లేచి ఎవరిమొహం చూశానోకాని అన్నీ వడ సళ్ళే. మొహం కడుక్కుందామని పళ్ళపొడి సీసాతీస్తే, అది కాస్తా చేయిజారిపడి పగిలిపోయింది. దానితో ప్రారంభం అమ్మ అక్షింతలకు మొహం కడుక్కుని స్నానం చెయ్యడానికి వెడితే బాయిలర్‌లో నీళ్ళు చల్లగా వున్నాయి. అవే కిక్కురు మనకుండా స్నానంచేసి బయట పడ్డాను బాత్‌రూములోంచి. అన్నానికి కూచుంటూ మంచి నీళ్లు దగ్గిర పెట్టుకోటం మరచి నందుకు, కూర్చోటంలో ఒకకాలికి మరోకాలు మడుచు కున్నార్చున్నందుకూ చిల్లర చివాట్లు-మొత్తానికి సాయంత్రం దాకా రుసరుసలు ధుమధుమ లూ భరించుకొచ్చాను. ఆపైని వళ్ళు మండిపోయి ఎవ్వరితోనూ మాట్లాడకూడదని నిశ్చ

యించుకున్నాను. ఊరికే కూర్చుంటే యేమీ తోచలా. అందుకని "పాలవెల్లి" కథల సంపుటితీసి అందులో సోదరి సావిత్రి వ్రాసిన "ఆహుతి" అక్కడక్కడా చదివాను. నేను కూడా ఓకథ రాయాలనిపించింది. వెంటనే బొగ్గులడబ్బా దగ్గర పొయ్యి రాజేసుకోటానికుంచిన కాగితాల్లో రాయని రూళ్ళకాగితాలు రెండు యేరి తెచ్చుకున్నాను. పెట్టెల చాటున దుమ్ముకొట్టుకుపోయిన బొటనవేలంత రంగు పెన్సిలు వెతుక్కు తెచ్చుకుని కత్తిపీటతో చెక్కి బ్రహ్మాండంగా కథ రాయటానికి పూనుకున్నాను. సరే గంటన్నరైంది. నా కథ కంచిదాకా పోయేట్టులేదు. విసుగెత్తి కాగితాలు పలకక్రింద పెట్టి కథ కాళ్ళు కుంటుబడ్డాయేమో అని ఆలోచిస్తూ వాకిట్లోకి వచ్చాను. ఎవరో ఒక అమ్మాయి పాపం, చంకనుజోలి, చేతిలో తాంబురతో పాటపాడుకుంటూ మా యింటికి వచ్చింది. జాలేసింది నాకు చాలా. మా లక్ష్మిని భిక్షం పెట్టమని సిఫార్సు చేశాను. ఇంటికామె పెద్ద కనుక-ఆమె ఆజ్ఞలేనిదే మరొకరు పెట్టరాదు కనుక. ఆమె చాలా క్రూరంగా "కొత్తబిచ్చం పొద్దెరగదుట. యిప్పుడేమి" టని అదలించింది. అమ్మాయి యీ చివాట్లను మారు మాటలేక జోలి నేసుకుని ప్రక్క గుమ్మం త్రొక్కింది, "సీతారామ స్వామి నేచేసిన నేరములే" మంటూ బయటికురికే యేడ్పును పాటతోలో నెట్టుతూ వయస్సు ముదురు చూపులతో ఆ యింటికుర్రాడు దుడుకు ప్రశ్న వేశాడు "మీఅమ్మ కెన్నో కాన్పు. "ముసలిదానా, నీ వెందుకు బిచ్చమెత్తుతున్నా" వని వర్కు లను

కోవాలనిఅతనికోరిక“ అమ్మ లేదుగా!”అందిభిక్షుకి—ఓడిన మొగంతో గెల్చినట్టు భావించి బైటపడ్డాడు వెకిలినవ్వుల రాయుడు. ఆ వెనుకే తప్పటడుగులపారాడు పిల్ల వచ్చీరాని మాటల్తో “అప్పచ్చితింతావా”అంది.“అన్నంతింటా”నంది భిక్షుకి. లోపలికిపోయి అమ్మను లాక్కొచ్చింది. ఆ ఇల్లాలు భిక్షుకిని పరామర్శించింది. భారతాంబ పడమటి యీాదురులో కొట్టుకుపోతూన్నా తన ధార్మికత్వాన్ని పూర్తిగా వదలలేదు! భిక్షుకికి తల్లిదండ్రులు లేరు. అన్న మెరుగదు ఆ ప్రొద్దుటినుండి. ఇల్లాలు ఆతిథ్యమిచ్చింది ఆ పండుగపూట. తప్పటడుగుల పిల్ల తన యింటికి దారి జూపించి దిక్కులేని పిల్లకు.

కన్నీరు తుడుచుకుంటూ నేనూ లోపలి కెళ్ళాను. మర్నాడు ఆ అమ్మాయి కాంగ్రెసువారి ఉచిత నిర్మాణ కార్యక్రమ శిక్షణకై వెళ్ళిందని విన్నాను. దీనులకాంగ్రెస్!”

అని రాణి తనకథ పూర్తిచేసింది.

“ ఎల్లావుం దన్నయ్యా ? ”

“ దాని మొహంలాగుంది ” అన్నాడు తన ఉద్రేకాన్ని వెళ్ళగక్కుతూ.

“అలా అంటావుగాని అన్నయ్యా, తొలిప్రయత్నమేమైనాచక్కనిగిలుకుకాదూ? దానికి వెలుగులుంచేవదినవన్నె కురాదూ? వదిన యింకావాళ్ళింట్లోనేవుంటే మంచికథకురాలయ్యేది. ఆడవాళ్లకు అత్తవారింటికివచ్చాక బుద్ధి సంసా

రాని కేగాని సాహిత్యానికి వినియోగపడదు. వినియోగింప రాదుకూడ. అది సంసార రక్షణ చట్టానికి విరుద్ధచర్య."

"మంచి లెక్చరు కొట్టావుగాని, అత్తవారింటికి వచ్చాకే తమ తెలివి తేటల అభివృద్ధి చేసుకున్న వారున్నారు."

"ఔను వేయికోకరు. పుణ్యపురుషుల ప్రోత్సాహంతో. మిగిలిన భర్తలు, పెరటిచెట్టు మందుకు రాదన్నట్లు, దారి స్త్రీలసాహిత్యానికి చూపరు, చేయూత నీయరు. ఒళ్లు మంట లుంటాయి తమకులేని అభిరుచి తమ భార్యల కున్నందుకు."

"చాల్లే, స్వాతంత్ర జెండా యెత్తావు స్త్రీ విద్యా సమస్య పరిష్కారానికి" అంటూ కళని కసిరాడు అది తన పుస్తకం లాగిందనే నెపంతో.

"వాదన మనవంతా రాణీ!" అంటూ వదినగారు కళని తీసుకుపోయింది.

---

# ప్రబోధము

—సింగరాజు ధారాధరశాస్త్రి

భారతావనిలోన ప్రభవించినావు
భారతీయుని పేరు నిలుపవలె నీవు

వీరబొబ్బిలి తాండ్ర పాపయ
రామరాయలు కృష్ణరాయలు
ప్రతాపదేవ శూర శివాజీ

ఏలినట్టి

భారతావనిలోన ప్రభవించినావు
భారతీయుని పేరు నిలుపవలె నీవు

స్వాతంత్ర్య వీధిలో
శుభ్ర జ్యోత్స్నలయందు
స్వీయ భారతి యెంతో
సమ్మోద మొందుచూ

వరలినట్టి

భారతావనిలోన ప్రభవించినావు
భారతీయుని పేరు నిలుపవలె నీవు.

# ఆషాఢకన్యా!

--విష్ణుభొట్ల కామేశ్వరరావు

ఓహో ఆషాఢకన్యా!
ఓహో ఆషాఢకన్యా!

పచ్చి యారని
తొలి సంజపా
రాణి శోభల
సలముకొని వచ్చేవా ?

ఇంద్ర నీలము
లార జిమ్ముచు
జాలు ముత్తెపు
జడులలో
పృధివిపై కాలూనకే
వ్యోమ పథముల నంటకే

ఒదిగి నడచుచు
పెండ్లి కొమరితవై
వచ్చేవా

ఓహో ఆషాఢకన్యా!
ఓహో ఆషాఢకన్యా!

లయను గలిపి
ప్రేమరాగము
నాలపించుచు

జగతి నంతా
మోహ ఝరులా
ముంచి వేయగ

వచ్చేవా

ఓహో ఆషాఢకన్యా!
ఓహో ఆషాఢకన్యా!

# అస్తమయం

—జమ్మలమడక పూర్ణచంద్రరావు

అస్తమయమా ? అప్పుడే !!!

ప్రొద్దున అతని వెంబడించి తుపాకీతో కాల్చాను. అతనాఖరిగుళ్లు నాపై పేల్చాడు చనిపోతూ. తొడచీల్చుకుని యిరుక్కుంది ఒకటి. మోకాటిచిప్ప తొలగించింది రెండోది. పడిపోయాను. అప్పుడే అస్తమయమా? పగ లెలా గడిచింది ?

పశ్చిమ మంతా హత్యాభూమి. త్రొక్కితే ఊరుతోంది రక్తం. సూర్యుడు పిరికిపంద. హత్యల పరిణామాన్ని చూసి బెదురుతున్నాడు. పట్టింపు లెరుగడు. ఆత్మరక్షణ హత్యకు ప్రభుత్వరక్షణ హత్యకూ ఎంతభేదం! మారుమూలల్లో నోరు మూతలతో హత్యకూ రణభూమిలో భేరీమ్రోతలతో హత్యకూ ఎంతభేదం! ఒకేమాట కిన్ని అర్థాలెవరు కల్పించారో! ఒకే సాధనకు ప్రత్యేకహక్కు లెవరు నిర్మించారో!

కుప్పలాపడి ఉన్నాడతడు. నోటివెంట కారి కాల్వలై గడ్డ కట్టింది రక్తం. ఎరుగ నింతకుముం దతనిని. ఈ యుద్ధభూమిలోగాక వేరొకచోట కలిస్తే ఒకరినొకరము గౌరవించుకునేవారముకామా? ఆదరించుకునేవారముకామా? ఇప్పుడీ మాత్సర్య మెలా పుట్టింది? 'యుద్ధ' మనే రెండక్షరాల్లో ఉన్నదా యీ మహాశక్తి? ఎవరికి యుద్ధం? ఎందుకు యుద్ధం?

మూలనుండి ప్రోత్సహించే దెవరు? ముంచుకొచ్చి ప్రాణ మిచ్చే దెవరు? ఉత్తమజాతియట మానవుడిది? ఒకరొట్టివేస్తే కరువమన్న వానిని కరుస్తుంది కుక్క. సైనికుడూ అంతే. పొట్టకూటి కొకరి అంశ జేరువాడు. చంపమన్న వానిని చంపువాడు. వీలుతప్పితే తానే చస్తాడు. ఎందుకు? బ్రతకటానికొచ్చిన భంగపాటా చావు? ప్రాణాలనివ్వలేని నాయకులకు తీసుకునే అధికార మెవరిచ్చారు? మేకలూ, కోళ్లలాగేనా సైనికుని బ్రతుకు? అవసరము వరకు మేపటం ఆ పైని చంపటం? ఇన్ని చావుల పరిణామం? యుద్ధం ముగుస్తుంది కొన్నాళ్లకు బహుశః యిరుపక్కలా చచ్చేవారు లేక. గౌరవప్రదంగా సంధి కుదురుతుంది. గౌరవాలు నాయకులకు గోరీలు సైనికులకు.

గండుచీమలతని గుండెల కండలు చెండిచూస్తున్నాయి. మానవత్వపు మచ్చుముక్కలకా? పద్దెనిమిది రూపాయల కమ్ముకున్నట్లు తెలియదు వాటికి !

వీరు డితడు యుద్ధపరిభాషలో! చచ్చేముందు తన ప్రతీకారం తీర్చుకు మరీ పోయ్యాడు. ఈ కాలు కదుప వీలు లేకుండా ఉంది. ఎంత బాధ! ఈ మొండిసాహినా లీ గుండెల్లో యెంతకాల ముంటాయో! కళ్లు మసకలు క్రమ్ముతున్నాయి. మెదడులో ఏమేమో యోచనలు పుట్టి కుప్పలై చచ్చిపోతున్నాయి.

నాలుక చుట్టుకుపోతోంది. 'వాటర్ బాటిల్' ఉన్న ట్యుస్థతని దగ్గర. చేరేదెలా? కదిలితే—అబ్బ! యమబాధ. గుండె తూసుకుపోయినా బాగుండేది. ఊడ్చేస్తోంది దాహం.

ఒక్క అంగుళమూ యింతప్రయత్నానికి జరిగింది! పదడుగు లున్నట్టుంది. ఎలా చేరటం...... అవయవాలనిక్కిసిళ్ళన్నాయి— దాహం తీరింది. బ్రతికి నే నపకారంచేస్తే చచ్చి ఉపకారం చేశా డీతను.

కారుచీకట్లలో, దిక్కు లేక యమయాతనలతో చచ్చి పోతున్నానని అమ్మ కేం తెలుసు? మా అబ్బాయి వస్తాడు ఇక—వస్తాడు—మరివస్తా''డని దారులుకాస్తుంది. విజయుడై వచ్చిన వాని కెలా స్వాగత మియ్యాలా అని యోచిస్తుంది. యుద్ధవార్తలు చదివిస్తుంది కోడలితో. చచ్చిన సంఖ్య మన వారిది చాలా తక్కువ. తృప్తికరమైనవార్త. అందులో తన కొడుకుంటాడా? ''ఛీ! పాడుతలపు! వాడు చిరంజీ''వని భావిస్తుంది. దీవిస్తుంది. ప్రతితల్లీ యింతే. అయితే చచ్చే దెవరి కొడుకులో! యుద్ధం పూర్తిఅయి సంధి కుదిరినట్లు వింటుంది. రేపోమాపో ఓడ దిగుతా డనుకుంటుంది. కళ్లు కాయలు కాస్తాయి నిరీక్షణతో. చచ్చినవారి పట్టీకూడా వస్తుంది. లేడం దులో తన కొడుకు. సంతోషం—బ్రతికిఉంటే, రాడేం? శత్రువుల ఖైదీ అయివుంటాడు. సంధిషరతుల ప్రకారం శత్రు పక్షం ఖైదీలను విడుదలచేస్తుంది. అయినా రాడు తన పాపడు. ఏమైనట్లు? అస్తమయమా? తల్లి హృదయం చిల్లి పడు తుంది శంకతో. ఇంతలో వస్తుంది మెఱుపు అచ్చులో కరకు వార్త—ప్రభుత్వ సానుభూతి. ఆరడుగుల కొడుకును ఆరంగు ళాల్లో దర్శనమిప్పించింది ప్రభుత్వం!

నాన్న ఫోటోచూపిస్తుంది నా పాపాయికి తల్లి. ఫోటో వద్దు. నిజంగా నాన్నను చూపించ''మనిమారాముచేస్తుంది

పాపాయి. కంట నీరు క్రుక్కుకుంటుంది తల్లి. మరిపిస్తుంది పాపాయిని తాను మరువకుండా. నవ్విస్తుంది పాపాయిని— తాను లో నేడుస్తూ !

మళ్లీ వచ్చాడీసూర్యుడు. హత్యాకాండ తిరిగి ప్రారంభం. ఎన్నిసార్లు తాగినా తీరటంలేదాకలి నీటికో. వాటర్ బాటిల్ ఖాళీ అయింది. ఎండ చిర్రుమంటోంది. అబ్బ! దుర్వాసన పట్టిం దీశవం! అప్పుడే యెప్పుడు పసిగట్టాయి ఈ గ్రద్దలు? పీక్కుతింటున్నాయి—ఎంత రాక్షసము! మనిషి కంటేనా? చంపుతా ననుకుంటాడు ప్రతిసైనికుడు. చచ్చిపోతా ననుకుంటే యుద్ధాలే యుండవేమో!

భగవాన్! ఇకనావంతా? బ్రతికి ఉండగా చిత్రవధా? వీటి నదలించే శక్తిలేదు. నాలుక ముడుచుకుంటోంది. తెలివి ... అస్తమయము!

---

# రాష్ట్రగీతి

—శేషగిరిరావు

వందే మహాంధ్ర మాతా! వందే స్వధర్మభూత!
దేవా వాసయోగ్యా! సకలార్థలోక నాకా!

మగధస్థ శిరకిరీటా! ప్రాగ్దిశాంసవస్త్రా,
తంజాపురస్థ పాదో! స్వస్వరూపాంధ్రమాతా॥

సర్వార్థ గర్భయోషా! మకరంద మధురభాషా
వేదాంతి రార్య గేయా! జాతీయ ఘనచరిత్రా

చేపుమవు గోమధూళీ! నవధాన్యక్షీరధారా
ఈ పెదవు లిట్టు లెండ! ఆపాత్ర లిట్టె నిండె! ॥

రతనాలు నీదు రాళ్లూ! నీమన్ను మంచి పైడీ
బిడ్డలకు మన్న, రాళ్లా! చూపితివి రొట్టె నడుగా॥

పశ్చిమపు పర్వతిములా పాతుకొనియున్న నిధులా
పెకలించి మాగృహాలా వేతు నీ 'నదికరాలా'॥

పాసింధు! కృష్ణవేణీ! గోదావరి వంశధారా
మంజీర! తుంగభద్రా! పెన్నా! మునేరుమిషలా,॥
నాచికా శిక్షణకునై ఉరమురము తీరములుగా
తీర్చావు కన్న తల్లీ! సుతులన్న నెంత ప్రేమో!॥

దిక్తట వ్యాప్త సుయశోమణి శిరోభూష కాంతీ
దిక్కాశితకర కనక ఘంటానినాద గీతీ
తొలి సుతులు నాడు నీకూ మురిపెమున కట్టుకొన్న
పట్టు సెల్లాల నిన్నూ ! దర్శించ నోతునమ్మా

విద్యుత్ శక్తిపోనీ ! తుదకన్న శక్తినైనా
నిర్మించు కొనకపోయె ! నీబలగ బలముసుంతా

జల పవన శక్తులన్నీ ! సంధించిజనక జననీ
సకలాంధ్ర సామ్యధర్మ స్థాపనము చేతుమమ్మ

కాలముల నాటి ఆంధ్ర వాయువులు కలుషపడెనో
ఎఱుపిఁక మాయలేదే ! పల్నాటికడలనోడ్చ
స్వేచ్ఛాతరంగములలో పరతంత్ర రేణువ్రాదీ !
నీ సుతులు తిరుగునట్టీ రోదసిని నించుమమ్మా

ఒకటిగా మేలుకాంచీ ! ముక్కోటి తెలుగుతలలూ
నీపాదపీఠి నిలిపి ! కంకణ కరములు మోడ్చి.

సంతభావిశుభముకైనా ! త్యాగాతపమున నీకు
స్వాతంత్ర్యస్తంభములపై మంటపాల్ వేతుమమ్మా !



# సాధన సమితి పోషకవర్గము

## మహారాజ పోషకులు

శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాజా వారు

## రాజపోషకులు

| | | |
|---|---|---|
| శ్రీ | వీరారెడ్డి నారాయణ రెడ్డిగారు | (చిన్నమదూరు) |
| ,, | శిర్నాం సత్యనారాయణ గారు | (సికింద్రాబాదు) |
| ,, | అర్వపల్లి రామకృష్ణ గారు | (ఖమ్మంమెట్టు) |
| ,, | గెల్లా ముత్తయ్యగారు | ,, |
| ,, | గెల్లా కేశవరావుగారు | ,, |
| ,, | కారంశెట్టి నరసయ్యగారు | ,, |
| ,, | సుగ్గల తిరుమలరావుగారు | ,, |
| ,, | కొండే సూర్యనారాయణ గారు | ,, |
| ,, | బెల్లంకొండ కృష్ణమూర్తిగారు | ,, |
| ,, | దాచేపల్లి వెంకటరామనరసయ్యగారు | ,, |
| ,, | రాయపూడి రంగయ్యగారు | ,, |
| ,, | సుగ్గల నాగేశ్వరరావుగారు | ,, |
| ,, | మిరియాల నారాయణగుప్తగారు | (మధిర) |
| ,, | చలువాది నాగభూషణంగారు | ,, |
| ,, | ఆకుల లక్ష్మీనారాయణగారు | (ఇల్లెందు) |
| ,, | మొరిశెట్టి లక్ష్మీనరసింహంగారు | (కొత్తగూడెం) |
| ,, | కంభంపాటి పుల్లయ్యగారు | ,, |

## పోషకులు

శ్రీ ఇల్లిందల రామచంద్రరావుగారు హెచ్.సి.యస్. (హైదరాబా
„ ఎ. ఐ. విద్యాసాగర్ గారు, హెచ్. సి. యస్. „
„ గొర్తి లక్ష్మీనారాయణగారు (శికింద్రాబాదు)
„ ములుగూరి పుల్లయ్యగారు [మధిర]
„ కురువిళ్ల నారాయణగారు [ఖమ్మంమెట్టు]
„ రాయప్రూడి రామకృష్ణయ్యగారు „
„ సోమా కోటయ్యగారు „
„ గడ్డం చిన నరసింహంగారు „
„ కొంకిమళ్ల చంద్రశేఖరంగారు „

---

చార్య కురుగంటి సీతారామయ్యగారి కృతులు

అలంకార తత్వవిచారము

తంజాపు రాంధ్రనాయకరాజ చరితము

ఆదర్శప్రభువు

నవ్యాంధ్రసాహిత్యవీధులు

కథాత్రయి

కొందఱు తంజావూరు కవులు-పండితులు

IAND BOOK OF TELUGU LITERATURE

— రానున్నవి —

వ్యాస లహరి (4 భాగములు)

దాక్షిణాత్య దార్శనికులు

SANSKRITIC STUDIES

SSAYS—HISTORICAL & LITERARY

్యాంధ్రసాహిత్యవీధులు (ద్వితీయ ముద్రణము)

★

హైదరాబాదాంధ్రసాహిత్యపరిషత్తు
89, బి, నాంపల్లి, హైదరాబాదు ద.

# సాధన సమితి ప్రచురణములు

1. అంజలి ... వివిధ రచయితలు
2. ప్రేంచంద్ అనువాదాలు ... శ్రీ నెల్లూరి కేశవస్వామి
3. పరీక్షచదువు ... శ్రీ భాగి నారాయణమూర్తి
4. నిర్మాణము ... శ్రీ 'సాధక'
5. పాలవెల్లి ... వివిధ రచయితలు
6. భోజరాజు ... శ్రీ గాదిరాజు వేంకటరమణయ్య
7. మధుకణములు ... శ్రీ పిల్లలమఱ్ఱి వెంకట హనుమంతరావు
8. సాంధ్యగీతి .. శ్రీ సూర్యచంద్రులు
9. వాహ్యాళి ... శ్రీ బూర్గుల రంగనాథరావు
10. భగ్నహృదయుడు ... శ్రీ భండారు చంద్రమౌళీశ్వరరావు
11. ఆముక్తమాల్యద పర్యాలోకనము ... శ్రీ వెల్దండ ప్రభాకరరావు
12. సాహితీ విపణి ... వివిధ రచయితలు

సాధన సమితి : సికిందరాబాదు